# వై.యస్.ఆర్ ఆసరా పథకం:

## గౌరవ ముఖ్యమంత్రి గారి విజన్ :

స్వయం సహాయక సంఘ అక్క చెల్లమ్మలు పడుతున్న ఆర్థిక ఇబ్బందులను "**ప్రజా సంకల్పయాత్ర**" లో చూసిచలించి పోయిన గౌరవ ముఖ్యమంత్రి గారు వారి ఉజ్వల భవిష్యత్ కోసం "**వై.యస్.ఆర్ ఆసరా**" పథకాన్ని ఈ ప్రభుత్వం యొక్క ప్రధాన కార్యక్రమమైన "నవరత్నాల" లో చేర్చడం జరిగినది.

## పథకం ముఖ్యమైన ఉద్దేశం:

ఈ పథకం వల్ల మహిళా సాధికారత మరింత మెరుగుయి, గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాలలోని స్వయం సహాయక సంఘాలలోని పేద మహిళల యొక్క ఆర్థిక పురోగతికి దోహదపడుతుంది. ఈ ప్రభుత్వం తీసుకొన్న ఈ నిర్ణయం ద్వారా అక్క చెల్లమ్మలు ఆర్థికంగా అభివృధి చెంది వారి కుటుంబాలు ఆనందంగా ఉంటాలానే ఉద్దేశం తో ఈ పథకంను తీసుకొనిరావడం జరిగినది.

## ఈ పథకం క్రింద ఎవరు అర్హులు :

- ✓వాణిజ్య మరియు సహకార బ్యాంకులలో ఋణం తీసుకొని తేది 11.04.2019 నాటికిఅప్పు నిల్వ ఉన్న అన్ని మహిళా స్వయం సహాయక సంఘాలు ఈ పథకం లో అర్హులు.

- ✓తేది 11.04.2019 నాటికి అక్క చెల్లమ్మలకు ఉన్న పొదుపు సంఘాల బ్యాంకు రుణాల అప్పు నిల్వ మొత్తం సొమ్మును 4 దఫాలుగా నేరుగా వారి సంఘం పొదపు ఖాతా లకు జమ చేయడానికి ఈ ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం జరిగింది.

- ✓వై.యస్.ఆర్ ఆసరాక్రింద 4 విడతలుగా ఇవ్వబోవు మొతాన్ని వివిధ కార్పొరేషన్ల ద్వారా (యస్.సి,యస్.టి,బిసి,ఈబిసి,కాపు,మైనారిటీ,క్రిస్టియన్) ఇవ్వడం జరుగుతుంది.

## ఈ పథకం క్రింద అందించు మొత్తం :

✓ఈ పథకం కింద రాష్ట్రంలోని 7,91,257 పొదుపు సంఘాల్లో ఉన్న 78,27,693 మంది అక్కచెల్లెమ్మలకు తేది 11.04.2019 నాటికి వారి సంఘాలలో ఉన్న అప్పు నిల్వ మొత్తం రూ.25,383.49 కోట్ల నేరుగా నాలుగేళ్లలో అక్కచెల్లమ్మల సంఘం పొదుపు ఖాతాల్లో జమచేయడం జరుగుతుంది.

✓మొదటి విడతగా రూ.6,345.87 కోట్ల రూపాయలను నేరుగా సెప్టెంబర్ 11 వ తేది న మన గౌరవ ముఖ్యమంత్రి శ్రీ. జగన్ మోహన్ రెడ్డి గారు అక్కచెల్లమ్మల సంఘాల పొదుపు ఖాతాలకు జమ చేసే రోజు చరిత్రలో నిలిచిపోయే రోజు ఈ రోజు.....

# వై.యస్.ఆర్ "సున్నా" వడ్డీ పథకం

- ✓గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాలలోని స్వయం సహాయక సంఘాలు తీసుకొన్న ఋణాలను సక్రమముగా తిరిగి చెల్లించుటకు, వారి పై పడిన వడ్డీ భారాన్ని తగ్గించడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారు వడ్డీ రాయితీ పథకాన్ని "వై.యస్.ఆర్ సున్నా వడ్డీ " గా అమలుచేస్తున్నారు.

- ✓ఈ పథకం అమలు వల్ల స్వయం సహాయక సంఘాలు బ్యాంకుల ద్వారా మరింత రుణం పొందడానికి మరియు వారు స్థాపించిన చిన్న తరహా వ్యాపారాలు మరింత లాభదాయకంగా, వడ్డీ భారం లేకుండా నడపడానికి, మెరుగైన జీవనం సాగించడానికి దోహద పడుతుంది.

## ప్రయోజనం

- ✓అర్హత గల ప్రతి స్వయం సహాయక సంఘమునకు రూ.3,00,000 /- లక్షల ఉప్పు నిల్వ వరకు పూర్తి వడ్డీ ప్రయోజనం చేకూరుతుంది .

## అర్హతలు

- ✓తేది.11.04.2019 నాటికి అప్పు నిల్వ ఉన్న స్వయం సహాయక సంఘాలు మరియు 11.04.2019 నుండి కొత్తగా ఋణం పొంది క్రమం తప్పకుండా ఋణ చెల్లింపులు చేస్తున్న స్వయం సహాయక సంఘాలు “సున్నా” వడ్డీకి అర్హులు.
- ✓క్యాష్ క్రెడిట్ లిమిట్ ద్వారా అప్పు పొందిన సంఘాలు నెలాఖరునాటికి ఉన్న అప్పు నిల్వలో కనీసం 3 శాతం మరుసటి నెలాఖరు లోపు చెల్లించాలి.
- ✓ఉదా: తేది 31.07. 2019 నాటికి ఉన్న బ్యాంకు అప్పు నిల్వ మొత్తం. రూ.3,00,000/- , పూర్తి వడ్డీ రాయితీ పొందడానికి కనీసం కట్టవలసిన 3 శాతం అంటే రూ.9,000/- 31.08.2019 నాటికీ పూర్తిగా చెల్లించాలి.

- ✓టర్మ్ లోన్ ద్వారా తీసుకొన్న ఋణము నెల వారి వాయిదా మొత్తంను కట్టవలసిన నెలాఖరునాటికి కట్టవలెను.

  ఉదా: తేది 05.07.2019 న అప్పు తీసుకొన్నట్లు అయితే నెలవారీ వాయిదా 05.08.2019 నాటికి కట్టవలసి ఉంటుంది. అయితే 31.08.2019 నాటికి కట్టినా పూర్తి వడ్డీ రాయితీ వర్తిస్తుంది.
- ✓వడ్డీ లేని ఋణ అర్హతను ప్రతినెల లెక్కించ బడుతుంది.

- ✓వాయిదా బకాయి ఉన్న సంఘాలు బకాయిలు పూర్తిగా చెల్లించిన పిదప మాత్రమే వడ్డీ లేని ఋణాల కు అర్హత పొందుతాయి. ఏ నెలలో అయితే బకాయిలు పూర్తిగా చేల్లిస్తారో ఆ నెలకు మాత్రమే వడ్డీ లేని ఋణం పొందుతారు.
- ✓ప్రస్తుత అప్పు నిల్వ, అప్పు మంజురుయిన మొత్తంనకు సమానంగా గాని లేక తక్కువగా గాని ఉన్న సంఘాలు అర్హత పొందుతాయి.

## ఉద్దేశ్యము :

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 45 నుండి 60 సంవత్సరాల మధ్య వయస్సు కలిగిన ఎస్.సి., ఎస్.టి., బి.సి. మరియు మైనారిటీ మహిళల కుటుంబాల పేదరికం, ఆర్థిక వెనుకబాటు తనాన్ని రూపు మాపి వారి యొక్క కుటుంబ జీవన ప్రమాణాలను మెరుగు పరుచుకోనుటకు చేయుతనిస్తూ, వారికి సుస్థిరమైన జీవనోపాధులను ఏర్పాటుతో పాటు, మార్కెటింగ్ సదుపాయాలు సమకూర్చటమే ఈ పథకము యొక్క ముఖ్య ఉద్దేశము.

## లక్ష్యము:

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని సుమారు 25 లక్షల వెనుకబడిన బడుగు బలహీన వర్గాల మరియు మైనారిటి మహిళల ఆర్థికాభివృద్ధితోపాటు, సుస్థిర జీవనోపాధి మరియు మహిళా సాధికారత సాధించడమే రాష్ట్ర ప్రభుత్వము యొక్క లక్ష్యం.

# వై.యస్.ఆర్ చేయూత పధకము అర్హతలు

| క్ర.సంఖ్య | విషయము | ఉండవలసిన అర్హతలు |
| --- | --- | --- |
| 1 | కుటుంబము | భార్య,భర్త, పిల్లలు, లబ్ధి దారుల మీద ఆధారపడిన కుటుంబ సభ్యులు |
| 2 | ఎవరికి వర్తిస్తుంది | BC,SC,ST మరియు మైనారిటీ మహిళలకు |
| 3 | వయస్సు | 12.6.2020 నాటికి 45 సంవత్సరాలు నుండి 60 సంవత్సరాలు వయస్సు కలిగిన మహిళలకు |
| 4 | కుటుంబ ఆదాయము | గ్రామీణ ప్రాంతాలలోని మహిళల కుటుంబానికి సంవత్సర ఆదాయము రూ.10000/-లోపల, పట్టణ ప్రాంతాలలోని మహిళలకు రూ.12000/-. లోపల ఉండవలెను |
| 5 | కుటుంబానికి ఉండవలసిన భూమి | తడి భూమి 3 ఎకరాలు. మెట్ట భూమి 10 ఎకరాలు లేదా తడి మరియు మెట్ట భూమి కలిపి 10 ఎకారాల లోపల ఉండవలెను. |

# వై.యస్.ఆర్ చేయూత పధకము అర్హతలు

| | | |
|---|---|---|
| 6 | మునిసిపాలిటి | మునిసిపాలిటి ప్రాంతాలలో ఇంటి స్థలము కాని మరియు కమర్షియల్ స్థలము కాని 1000 Sq ఫీట్ స్థలము కంటే మించరాదు. |
| 7 | వాహనము | నాలుగు చక్రాల సొంత వాహనము ఉండరాదు ( టాక్సీ, ట్రాక్టర్ మరియు ఆటో వారికి వర్తించదు). |
| 8 | విద్యుత్ | నెల వారి కుటుంబ విద్యుత్ వినియోగము 300 యూనిట్ కంటే తక్కువ వినియోగము కలిగి ఉండవలెను. |
| 9 | ఉద్యోగము | కుటుంబములో ఎటువంటి ప్రభుత్వ ఉద్యోగమూ కాని లేక పదవి విరమణ పించను పొందుతున్న వారు అనర్హులు |
| 10 | ఆదాయపు పన్ను | కుటుంబము సభ్యులలో ఆదాయపు పన్ను చెల్లింపు దారులు ఉండకూడదు. |

## వై.యస్.ఆర్ చేయూత పధకము-లబ్దిదారుల ఎంపిక విధానము:

✓ గ్రామ/వార్డ్ వాలంటీర్ ద్వారా అర్హత కలిగిన మహిళను యాప్ ద్వారా సమాచార సేకరణ చేయడము జరిగింది.

✓ గ్రామ/వార్డ్ వాలంటీర్ ద్వారా సేకరించన సమాచారమును గ్రామ/వార్డ్ సంక్షేమ సెక్రటరీ మరొక సారి పరిశీలించడము జరుగుతుంది.

✓ గ్రామ/వార్డ్ సంక్షేమ సెక్రటరీ సేకరించిన సమాచారమును బట్టి సామాజిక తనిఖీ కొరకు ప్రతి గ్రామ/వార్డ్ సచివాలయములో ప్రదర్శించడము జరిగింది.

✓ గ్రామ/వార్డ్ సంక్షేమ సెక్రటరీ ద్వారా తాత్కాలిక అర్హత కలిగిన లబ్దిదారుల సమాచారమును మండల అభివృద్ధి అధికారికి మరియు మునిసిపల్ కమీషనర్ వారికి ఆన్లైన్ లో పంపడము జరిగింది .

✓ మండల అభివృద్ధి అధికారికి మరియు మునిసిపల్ కమీషనర్ సామాజిక తనిఖీ లో వచ్చిన పిర్యాదులను మరొకసారి పరిశీలించి తన లాగిన్ నందు అప్డేట్ చేసి తుది లబ్దిదారుల జాబితాను తయారు చేయడము జరిగింది.

✓ మండల అభివృద్ధి అధికారికి మరియు మునిసిపల్ కమీషనర్ తుది వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జాబితాను సంబందిత E.D కార్పోరేషన్ (SC,ST,BC మరియు మైనారిటీ) వారికి సమర్పించడము జరిగింది.

# వై.యస్.ఆర్ చేయూత పథకము-లబ్ధిదారుల ఎంపిక విధానము:

✓E.D, SC,ST,BC మరియు మైనారిటీ కార్పోరేషన్ వారు తుది వై.యస్.ఆర్ చేయూత లబ్ధిదారుల జాబితాను సంబంధిత జిల్లా కలెక్టర్ వారికి పంపించి వారి ఆమోదము పొందడము జరుగింది.

✓జిల్లా కలెక్టర్ వారి ద్వారా ఆమోదము పొందిన లబ్ధిదారుల జాబితాను CEO SERP కార్యాలయానికి ఆన్లైన్ ద్వారా పొందడము జరుగింది.

✓CEO-SERP వారు కార్పోరేషన్ వారిగా తుది లబ్ధిదారుల జాబితా ప్రకారము నిధులను ప్రభుత్వము నుండి సమకూర్చుకొని CFMS కు లబ్ధిదారుల జాబితాను పంపడము జరుగింది..

✓గౌరవ ముఖ్యమంత్రి శ్రీ Y.S జగన్ మోహన్ రెడ్డి గారి చేతుల మీదుగా తేది.12.08.2020 న అక్క,చెల్లెమ్మల బ్యాంక్ అకౌంట్ కు నిధులను జమ చేయడము జరుగింది.

## వై.యస్.ఆర్ చేయూత పథకము-లబ్దిదారుల ఎంపిక విధానము:

✓ఈ పథకం ద్వారా దేశంలో ఎక్కడా లేని విధంగా బడుగు, బలహీన వర్గాలు, మైనార్టీలకు చెందిన దాదాపు 23 లక్షల మంది మహిళలకు 4 ఏళ్లలో రూ.17250 కోట్ల లబ్ధి చేకూరనుంది. మహిళలు జీవనోపాధి పొందే మార్గాలపై ఈ సహాయాన్ని వినియోగించుకుంటే వారి సామర్థ్యాన్ని పెంచడంతో పాటు మార్కెటింగ్, సాంకేతికపరమైన సహకారాన్ని అందించేలా ప్రభుత్వం చేయుతనిస్తుంది .

✓ప్రభుత్వం అందిస్తున్న సహాయం ద్వారా మహిళల్లో ఆర్థిక సుస్థిరత, తద్వారా మహిళల ఆర్థిక వ్యవస్థ ప్రగతికి తోడ్పాటునందిస్తుంది.

✓వ్యవసాయం, పశు పోషణ, చేనేత, హస్తకళలు, ఆహార ఉత్పత్తుల తయారీ, కిరాణా దుకాణాలు, చిరు వ్యాపారాలు, తదితర రంగాలల్లో ఉన్న మహిళలకు బలమైన తోడ్పాటు అందించడం తో పాటు వారి జీవనోపాధి అవకాశాలు మరింత మెరుగుపడనున్నాయి.

- ఈ దిశగా మహిళలకు అవసరమైన సాంకేతిక, మార్కెటింగ్ సహకారాలు అందించేలా ఇప్పటికే అమూల్, ఐటీసీ, హెచ్ యు ఎల్, పి&జీ మరియు రిలయన్స్ లాంటి ప్రఖ్యాత, దిగ్గజ  కంపెనీలతో ప్రభుత్వం అవగాహనా ఒప్పందాలు కుదుర్చుకుంది. ఈ కంపనీలతోనే కాకుండా భవిష్యత్తులో మరికొన్ని ప్రపంచ ప్రఖ్యాత కలిగిన భహుళ కంపనీలతో మహిళల వ్యాపార సామర్ధ్యాన్ని పెంచుటకు ఒప్పందాలు చేసుకోవడము జరుగుతుంది.
- ఈ కంపెనీల ద్వారా మహిళలకు స్థిరమైన ఆదాయం కల్పించేలా జీవనోపాధి కలగడంతో పాటు గ్రామీణ మరియు పట్టణ స్థాయిలో కార్యకలాపాలు పుంజుకొని అదనంగా దాదాపు 2.25 లక్షల మందికి ఉపాధి అవకాశాలు ఏర్పడతాయి.
- ఇందులోభాగంగా రిటైల్ రంగంలో దుకాణాలు నడుపుకుంటున్న వై.యస్.ఆర్.చేయూత పథకం లబ్ధిదారులైన మహిళలను గుర్తించి .హెచ్యూల్, ఐటీసీ, పీ అండ్ జీ కంపెనీల సేవలు కలిగిన ప్రాంతాలలో  ఉన్న వ్యాపారము చేసే మహిళలను  గుర్తించి అనుసంధానము చేయడము జరుగుతుంది.

*భహుళ జాతి కంపినీల సహకారము (హెచ్‌యూల్, ఐటీసీ, పీ అండ్ జీ)*

- ✓ఇన్వెంటరీ మేనేజ్‌మెంట్, స్టాకింగ్ మేనేజ్‌మెంట్‌లో వారికి శిక్షణ ఇస్తారు.
- ✓భాగస్వాములైన కంపెనీలు ఏం చేస్తాయంటే...
- ✓మహిళకు చేయూతనిచ్చే కార్యక్రమాల్లో ఎంఓయూలు (MOU) కుదుర్చుకున్న కంపెనీలు కీలకంగా వ్యవహరిస్తాయి.
- ✓లబ్ధిదారులైన మహిళలు ఉన్న ప్రాంతాల్లో తమ సేవల కలిగిన ప్రాంతాలను గుర్తిస్తాయి.
- ✓ఉత్పత్తుల కొనుగోలులో వారికి తోడ్పాటు అందిస్తాయి.
- ✓కిరణా వ్యాపారం చేసే వారికి శిక్షణ ఇస్తాయి. వారిలో వ్యాపార సామర్థ్యాన్ని పెంచుతాయి.
- ✓గుర్తించిన క్లస్టర్లలో కార్పొరేట్ కార్యక్రమాలతో సుస్థిర ఆదాయాలకు ప్రణాళికను అమలు చేస్తాయి

## మహిళా లబ్ధిదారులను గుర్తించుట లో తీసుకోవలసిన జాగ్రత్తలు :

- ✓"వై.యెస్.ఆర్. చేయూత" లబ్ధిని ఉపయోగించుకుని యూనిట్ పెట్టటానికి ఆసక్తి కలిగి ఉండాలి.
- ✓పైన తెలిపిన కంపెనీలతో అనుసంధానం చేసుకుని వారి ఆధ్వర్యములో ఉత్పత్తులను తయారు చేయటం లేదా మార్కెటింగ్ చేసుకోవటానికి ఒప్పందము చేసుకోవలసి ఉంటుంది.
- ✓పాడి పరిశ్రమ – పాల ఉత్పత్తి యూనిట్లు పెట్టటానికి ఆసక్తి ఉన్నవారు.
- ✓గృహ మరియు ఆరోగ్యమునకు (జనరల్ స్టోర్, కిరాణా మరియు ఆహార) సంబంధమైన ఉత్పత్తులు తయారీ యూనిట్లు పెట్టటానికి ఆసక్తి ఉన్నవారు.
- ✓కూరగాయలు, పూలు మరియు పండ్ల తోటలు పెంపకము నకు అవకాశము మరియు ఆసక్తి వున్నవారు.
- ✓వ్యవసాయం మరియు అనుబంధ కార్యక్రమాలు.
- ✓వస్త్ర, చేనేత మరియు చేతి వృత్తులకు సంబంధించిన ఉత్పత్తులు
- ✓అగరుబత్తీలు తయారీ
- ✓కోళ్ళ పెంపకము మొదలైనవి.

✓లబ్ధిదారులు ఎంపిక చేసుకున్న యూనిట్ ప్రస్తుతము ఉన్నది అయితే దానిని అభివృద్ధి చేసుకోవటానికి లేదా నూతనముగా ఏర్పాటు చేసుకోవటానికి కాని రూ.75,000/- లు మంజూరు చేయబడతాయి. దానిలో ఒక వంతు రూ.18,750/- లు లబ్ధిదారుని వాటా కాగా (వై.యెస్.ఆర్. చేయూత పథకము ద్వారా వచ్చిన మొదటి విడత మొత్తము) మిగిలిన 3 వంతులు రూ. 56,250/- లను బ్యాంకు నుండి ఋణము మంజూరు చేయబడుతుంది. ఆ ఋణమును సభ్యులు వారి ఆదాయమును బట్టి నెలవారీ వాయిదాలు నిర్ణయించుకుని అసలు మరియు వడ్డీతో సహా బ్యాంకునకు చెల్లించవలసి ఉంటుంది.

## ఆప్షన్ ఫార్మ్ నింపడానికి సూచనలు (SOP)

| క్రమ సంఖ్య | విషయము | వివరణ | భాద్యత |
| --- | --- | --- | --- |
| 1 | వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక పత్రం | YSR చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక కొరకు ఆప్షన్ తయారు చేయుట | SERP |
| 2 | వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక పత్రం ప్రింటింగ్ | ప్రతి జిల్లలో ఉన్న మండలాల వారిగా, YSR చేయూత లబ్ది దారులను బట్టి | DPM(LH) |
| 3 | శిక్షణ | వై.యస్.ఆర్ చేయూత పైన అవగాహన మరియు లబ్దిదారుల జీవనోపాధుల పత్రమును ఎలా నింపాలి, | DPM( LH) |
| 4 | పంపిణి | HCM లేఖ మరియు వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక పత్రం | VOA,గ్రామ/వార్డ్ వాలంటీర్ |
| 5 | అవగాహన | గ్రామ స్థాయిలో వై.యస్.ఆర్ చేయూత పైన | VOA,గ్రామ/వార్డ్ వాలంటీర్ |
| 6 | యాప్ | యాప్ తయారీ | APCFSS |
| 7 | లబ్దిదారుల యొక్క జీవనోపాధుల పత్రాల సేకరణ | లబ్దిదారుల యొక్క జీవనోపాధుల పైన అవగాహన్ కల్పించి వారి యొక్క సమ్మతి పత్రాల సేకరణ | VOA,గ్రామ/వార్డ్ వాలంటీర్ |
| 8 | లబ్దిదారుల సమ్మతి పత్రాలు భద్రపరుచుట | లబ్దిదారులు ఏ కార్యక్రమాలను చేపడుతున్నారు క్రోడీకరించుట | గ్రామ/వార్డ్ సెక్రటరీ WEA |
| 9 | సమాచారము నమోదు | లబ్ది దారుల సమాచారాన్ని డేటా ఎంట్రీ చేయుట | గ్రామ/వార్డ్ సెక్రటరీ డిజిటల్ అసిస్టెంట్ |
| 10 | పర్యవేక్షణ | మండల స్థాయిలో కార్యక్రమాల పర్యవేక్షణ | APM మరియు CC |



# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



# వై.యస్.ఆర్ "సున్నా" వడ్డీ పథకం

గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాలలోని స్వయం సహాయక సంఘాలు తీసుకొన్న ఋణాలను సక్రమముగా తిరిగి చెల్లించుటకు, వారి పై పడిన వడ్డీ భారాన్ని తగ్గించడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారు వడ్డీ రాయితీ పథకాన్ని "వై.యస్.ఆర్ సున్నా వడ్డీ " గా అమలుచేస్తున్నారు.

ఈ పథకం అమలు వల్ల స్వయం సహాయక సంఘాలు బ్యాంకుల ద్వారా మరింత రుణం పొందడానికి మరియు వారు స్థాపించిన చిన్న తరహా వ్యాపారాలు మరింత లాభదాయకంగా, వడ్డీ భారం లేకుండా నడపడానికి, మెరుగైన జీవనం సాగించడానికి దోహద పడుతుంది.

## ప్రయోజనం

* అర్హత గల ప్రతి స్వయం సహాయక సంఘమునకు రూ.3,00,000 /- లక్షల ఉప్పు నిల్వ వరకు పూర్తి వడ్డీ ప్రయోజనం చేకూరుతుంది .

## అర్హతలు

* తేది.11.04.2019 నాటికి అప్పు నిల్వ ఉన్న స్వయం సహాయక సంఘాలు మరియు 11.04.2019 నుండి కొత్తగా ఋణం పొంది క్రమం తప్పకుండా ఋణ చెల్లింపులు చేస్తున్న స్వయం సహాయక సంఘాలు "సున్నా" వడ్డీకి అర్హులు.
* క్యాష్ క్రెడిట్ లిమిట్ ద్వారా అప్పు పొందిన సంఘాలు నెలాఖరునాటికి ఉన్న అప్పు నిల్వలో కనీసం 3 శాతం మరుసటి నెలాఖరు లోపు చెల్లించాలి.

  ఉదా: తేది 31.07. 2019 నాటికి ఉన్న బ్యాంకు అప్పు నిల్వ మొత్తం. రూ.3,00,000/- ,
  పూర్తి వడ్డీ రాయితీ పొందడానికి కనీసం కట్టవలసిన 3 శాతం అంటే రూ.9,000/-
  31.08.2019 నాటికీ పూర్తిగా చెల్లించాలి.

* టర్మ్ లోన్ ద్వారా తీసుకొన్న ఋణము నెల వారి వాయిదా మొత్తంను కట్టవలసిన నెలాఖరునాటికి కట్టవలెను.

  ఉదా: తేది 05.07.2019 న అప్పు తీసుకొన్నట్లు అయితే నెలవారీ వాయిదా 05.08.2019 నాటికి కట్టవలసి ఉంటుంది. అయితే 31.08.2019 నాటికి కట్టినా పూర్తి వడ్డీ రాయితీ వర్తిస్తుంది.

* వడ్డీ లేని ఋణ అర్హతను ప్రతినెల లెక్కించ బడుతుంది.
* వాయిదా బకాయి ఉన్న సంఘాలు బకాయిలు పూర్తిగా చెల్లించిన పిదప మాత్రమే వడ్డీ లేని ఋణాల కు అర్హత పొందుతాయి. ఏ నెలలో అయితే బకాయిలు పూర్తిగా చేల్లిస్తారో ఆ నెలకు మాత్రమే వడ్డీ లేని ఋణం పొందుతారు.
* ప్రస్తుత అప్పు నిల్వ, అప్పు మంజురయిన మొత్తంనకు సమానంగా గాని లేక తక్కువగా గాని ఉన్న సంఘాలు అర్హత పొందుతాయి.

# వై.యస్ ఆర్. పెన్షన్ కానుక

రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన "నవరత్నాల"లో "వై.యస్.ఆర్ పెన్షన్ కానుక" ఒకటి. ఈ పథకం పారదర్శకంగా అర్హులైన అందరికి పించను అందించాలనే ధ్యేయంతో ప్రభుత్వం తగిన చర్యలు తీసుకుంతోంది. దీని కొరకు అర్హతలను సడలించి అన్ని వర్గాల ప్రజలకు పించను కానుక అందిచేవిధంగా చర్యలు గైకొనడం జరిగింది.

1. **కేటగిరీ వారిగా  నూతన విధానంలో పెన్షన్ దరఖాస్తు దారులకు ఉండవలసిన అర్హతలు :**

a. మొత్తం కుటుంబ ఆదాయం గ్రామీణ ప్రాంతంలో నెలకు రూ.10,000 మరియు పట్టణ ప్రాంతంలో నెలకు   రూ.12,000 మించరాదు.
b. వయస్సు ఆధార్ కార్డు ప్రకారం తీసుకొనబడును.
c. భూమికి సంబంధించి మొత్తం కుటుంబానికి మాగాణి అయితే 3 ఎకరాలు లేదా మెట్ట అయితే 10 ఎకరాలు లేదా మాగాణి, మెట్ట భూమి రెండు కలిపి 10 ఎకరాలు మించరాదు.
d. కుటుంబానికి నాలుగు చక్రాల వాహనం ఉండకూడదు (టాక్సీ, ట్రాక్టర్ మరియు ఆటోలు మినహాయింపు).
e. కుటుంబం సభ్యులు ప్రభుత్వ ఉద్యోగి లేదా పింఛను దారులై ఉండరాదు.

f. కుటుంబ నివాసం (సొంత / అద్దె) యొక్క నెలవారీ విద్యుత్ వినియోగం నెలకు 300 యూనిట్ల కంటే తక్కువగా ఉండాలి.

g. పట్టణ ప్రాంతంలో కుటుంబ నివాసం1000చదరపు అడుగుల లోపు నిర్మించినదై ఉండాలి.

h. కుటుంబ సభ్యులు ఆదాయపు పన్ను పరిధిలోకి రాకూడదు.

i. కింది షరతులతో కుటుంబంలో ఒకటి కన్నా ఎక్కువ పెన్షన్లు అనుమతించబడుతుంది.

1. 40% మరియు అంతకంటే ఎక్కువ వైకల్యం ఉన్న వికలాంగుల కుటుంబం.
2. డయాలసిస్ రోగులు (సికెడియు) / తీవ్రమైన మెంటల్ రిటార్డేషన్ / పిఎల్‌హెచ్‌వి (ఎఆర్‌టి)
3. జి.ఓ.ఆర్.ఆర్టి.నెం.551 లో ప్రతిపాదించిన పెన్షన్లు మంజూరు చేయడం జరుగుతుంది

## 2.వివిధ కేటగిరీ వారీగా ఫింఛనుదారులకు కావలసిన అర్హతలు:

- **వృయోవృద్ధులు**: 60 సంవత్సరాలు మరియు ఆ పై వయస్సు కలవారు (జిఓతేది30.05.19.) మరియు గిరిజనులకు 50 సంవత్సరాలు మరియు ఆ పై వయస్సు కలవారు (జి.ఓ.నెం49., తేదీ 10.02.2019 ప్రకారం)
- **వితంతులు**: వివాహ చట్టం ప్రకారం 18 సంవత్సరాల పై బడి వయసు కలవారు. భర్త మరణ ధ్రువీకరణ పత్రం కలిగి ఉండాలి.
- **వికలాంగులు**: వీరికి వయో పరిమితి లేదు. 40% మరియు ఆపైన వికలత్వం కలిగి ఉన్నవారు మరియు SADAREM సర్టిఫికెట్ కలిగి ఉండాలి.
- **చేనేత కార్మికులు**: వయస్సు 50 సంవత్సరాలు మరియు ఆపైన కలవారు. చేనేత మరియు జౌళి శాఖ వారిచే గుర్తింపు పత్రం కలిగి ఉండాలి.
- **కల్లుగీత కార్మికులు**: వయస్సు 50 సంవత్సరాలు మరియు ఆపైన కలవారు. టాడీ కో-ఆపరేటివ్ సొసైటీస్ (టిసిఎస్) సభ్యులు లేదా ట్రీ ఫర్ టాపర్స్ (టిఎఫ్టి) పథకం కింద ఒక వ్యక్తిగత ట్యాప్పర్‌కు. ఎక్సైజ్ శాఖ వారు జారీ చేసిన గుర్తింపు పత్రం కలిగి ఉండాలి.
- **ఆర్ట్ పెన్షన్స్(PL HIV)**: 6 నెలలు వరుసగా ART treatment (Anti Retroviral Therapy) తీసుకుంటున్న వారు.
- **డయాలిసిస్ పెన్షన్ (CKDU)**: వయస్సుతో సంబంధం లేకుండా ప్రతి నెలా ప్రభుత్వ మరియు ప్రైవేటు ఆసుపత్రులలో డయాలసిస్ తీసుకుంటూ ఉన్నవారు.

- **ట్రాన్స్ జెండర్: 18** సంవత్సరాలు ఆపైన వయస్సు కలిగి ఉండాలి. ప్రభుత్వ వైద్య ఆరోగ్య శాఖ వారి సర్టిఫికేట్ కలిగినవారు.
- **మత్స్యకారులు**: వయస్సు 50 సంవత్సరాలు మరియు ఆపైన కలవారు. మత్స్య శాఖ వారిచే జారీ చేసిన గుర్తింపు పత్రం కలిగి ఉండాలి.
- **ఒంటరి మహిళ**: 35 ఏళ్లు పైబడి, భర్త నుండి విడిపోయిన మహిళలు మరియు భర్త నుండి విడిపోయి 1 సంవత్సర కాలం మించి ఉండాలి. గ్రామీణ ప్రాంతాలలో 30 సంవత్సరాలు మరియు అంతకంటే ఎక్కువ వయస్సు ఉన్న పెళ్లికాని మహిళలు మరియు పట్టణ ప్రాంతాల్లో 35 సంవత్సరాలు మరియు అంతకంటే ఎక్కువ వయస్సు ఉన్న పెళ్లి కాని మహిళలు.
- **డప్పు కళాకారులు**: 50 సంవత్సరాల వయసు నిండిన వారు మరియు సాంఘిక సంక్షేమ శాఖ వారు జారీ చేసిన లబ్దిదారుల జాబితా ప్రకారం {as per G.O.R.T. No 199 dated 30.06.18 (SWD)}.
- **చర్మకారులు**: 40 సంవత్సరాల వయసు నిండిన వారు మరియు సాంఘిక సంక్షేమ శాఖ వారు జారీ చేసిన లబ్దిదారుల జాబితా ప్రకారం {as per G.O.R.T. No 191 dated 12.11.18 (SWD)}.

- **దీర్ఘ తలసేమియా**: వయోపరిమితి లేదు.  జిల్లా వైద్య మరియు ఆరోగ్య అధికారి / జిల్లా కుష్టు అధికారి / జిల్లా మలేరియా అధికారి వద్ద అందుబాటులో ఉన్న జాబితాకు మాత్రమే పింఛను ఇవ్వబడుతుంది.
- **సికిల్ సెల్ వ్యాధి**: వయోపరిమితి లేదు.  జిల్లా వైద్య మరియు ఆరోగ్య అధికారి / జిల్లా కుష్టు అధికారి / జిల్లా మలేరియా అధికారి వద్ద అందుబాటులో ఉన్న జాబితాకు మాత్రమే పింఛను ఇవ్వబడుతుంది.
- **తీవ్ర హీమోఫీలియా** (<2% of factor 8 or 9): వయోపరిమితి లేదు.  జిల్లా వైద్య మరియు ఆరోగ్య అధికారి / జిల్లా కుష్టు అధికారి / జిల్లా మలేరియా అధికారి వద్ద అందుబాటులో ఉన్న జాబితాకు మాత్రమే పింఛను ఇవ్వబడుతుంది.
- **ద్వైపాక్షిక బోద వ్యాధి** – గ్రేడ్ 4 –: వయోపరిమితి లేదు.  జిల్లా వైద్య మరియు ఆరోగ్య అధికారి / జిల్లా కుష్టు అధికారి / జిల్లా మలేరియా అధికారి వద్ద అందుబాటులో ఉన్న జాబితాకు మాత్రమే పింఛను ఇవ్వబడుతుంది.
- **పక్షవాతంతో** చక్రాల కుర్చీ లేదా మంచానికే పరిమితమైన వారు: వయో పరిమితి లేదు. డేటాను SADAREM డేటా బేస్ నుండి పొందవచ్చు మరియు వైద్య అధికారిచే క్షేత్రస్థాయిలో ధృవీకరించబడుతుంది.

- **తీవ్రమైన కండరాల బలహీనత** మరియు ప్రమాద బాధితులు, చక్రాల కుర్చీకి లేదా మంచానికి పరిమితమైనవారు: వయో పరిమితి లేదు.  డేటాను SADAREM డేటా బేస్ నుండి పొందవచ్చు మరియు వైద్య అధికారిచే క్షేత్రస్థాయిలో ధృవీకరించబడుతుంది.

- **దీర్ఘకాలిక మూత్ర పిండాల వ్యాధిగ్రస్తులకు** (3, 4 & 5 స్టేజీలలో) డయాలసిస్ చేయించుకోని మరియు క్రింది పరిస్థితులు కలిగి ఉన్నవారు:

  a. సీరం క్రియాటినిన్ 5 mg కంటే ఎక్కువ మరియు రెండు వేర్వేరు
     కనీసం 3 నెలల వ్యవధితో (ప్రభుత్వ ల్యాబ్ లో) పరీక్షించబడి నిర్ధారించిన వారు.
  b. సోనోగ్రాఫిక్ మూల్యాంకనం పై కుచించుకుపోయిన మూత్ర పిండాలు
     (8సెం.మీ కంటే తక్కువ)
  15ml అంచనా (G.O.Rt. No.551 HMFW dt. 26.10.2019)

**3. జీవిత భాగస్వామి పెన్షన్:**

వృద్ధాప్యం, చేనేత, మత్స్యకారులు, కల్లుగీత కార్మికులు, వికలాంగ కేటగిరీ పెన్షనర్లు మరణించిన సందర్భంలో, కుటుంబాన్ని పోషించడానికి వారి జీవిత భాగస్వామి (భార్య) కు వితంతు పెన్షన్ గా మంజూరు చేయబడుతుంది.

4. **అర్హత ధృవీకరణ:**

సంబధిత శాఖలు అభివృద్ధి చేసిన డేటాబేస్లలోని సామాజిక-ఆర్థిక డేటా మరియు వెబ్ సేవ ద్వారా డేటా రిపోజిటరీతో అర్హత ప్రమాణాలు ధృవీకరించబడతాయి.

5. **గ్రామ /వార్డు వాలంటీర్ల పాత్ర:**

గ్రామ / వార్డు వాలంటీర్లు సామాజిక భద్రత పెన్షన్‌కు అర్హులైన లబ్దిదారులను వైఎస్ఆర్ పెన్షన్ కానుక కింద గుర్తించి, ప్రతి కేటగిరీ పెన్షన్‌కు సూచించిన అర్హత ప్రమాణాల ప్రకారం భౌతిక ధృవీకరణ (సామాజిక తనిఖీ) చేయడం జరుగుతుంది. వాలంటీర్లు పెన్షన్ ప్రయోజనాల పంపిణీని పెన్షన్ దారు ఇంటికి చేరేలా నిర్ధారించుకోవాలి.

**6. మండల అభివృద్ధి అధికారి మరియు మునిసిపల్ కమీషనర్ పాత్ర:**

గ్రామీణ ప్రాంతాలలో మండల అభివృద్ధి అధికారి మరియు పట్టణ ప్రాంతాలలో మునిసిపల్ కమీషనర్ వారు ఈ పథకం అమలులో పూర్తి బాధ్యతను పోషిస్తారు. డేటా నిర్ధారించుటలో మరియు క్షేత్ర స్థాయి పరిశీలనలో ఏవిధమైన తేడాలు ఉన్నచో, టీం అనగా మండల అభివృద్ధి అధికారి,తహాసీల్దారు మరియు ఈ.ఓ పి.ఆర్.డి గ్రామీణ ప్రాంతాలలో మరియు మున్సిపల్ కమిషనరు మరియు తహాసీల్దారు పట్టణ ప్రాంతాలలో పునఃపరిశీలన చేసిన నివేదికను జిల్లా పథక సంచాలకులకు సమర్పించవలెను.

7. జిల్లాలో ఈ పథకాన్ని విజయవంతంగా అమలు చేయడానికి ప్రాజెక్ట్ డైరెక్టర్, డి.ఆర్.డి.ఏ వారు పర్యవేక్షిస్తారు.

8. ముఖ్యకార్యనిర్వహణాధికారి, గ్రామీణ పేదరిక నిర్మూలనా సంస్థ, ఆంధ్ర ప్రదేశ్, విజయవాడ వారు ఈ విషయంలో తదుపరి చర్యలు తీసుకోవాలి.

9. లబ్ధిదారుని వయస్సును నిర్ణయించడానికి మొత్తం కుటుంబాన్ని పరిగణలోనికి తీసుకోవడానికి ఈ క్రింది విధానాన్ని అనుసరించాలి,

i. ఆధార్ కార్డు ద్వారా వయస్సును ధృవీకరించడం.
ii. ఆధార్ కార్డు వివరాలను రేషన్ కార్డు డేటాతో పోల్చడం.
iii. సంబదిత శాఖల డేటా ప్రకారం కుటుంబం వివరాలతో నిర్ధారించడం.
iv. క్షేత్ర స్థాయి తనిఖీలు
  a.వ్యక్తిగత సర్టిఫికెట్స్ ఆధారంగా పరిశీలించాలి.
  b. వారి పిల్లల సర్టిఫికెట్స్ ఆధారంగా పరిశీలించాలి.
  c.పెళ్లి నిర్ధారణ సర్టిఫికెట్స్ ఆధారంగా పరిశీలించాలి.
  d.పెళ్లి జరిగిన సంవత్సరం ఆధారంగా.
  e.స్థానికంగా విచారించడం.
v. మెడికల్ బోర్డు సర్టిఫికేట్ ఆధారంగా ధృవీకరించడం.

# పది రోజుల్లో పింఛన్ల మంజూరు

## దరఖాస్తు స్వీకరించిన తేదీ నుండి 10 పని దినాలలోపు మొత్తం ప్రక్రియను పూర్తి చేయాలి.

| | |
|---|---|
| 1 వ రోజు | వాలంటీర్లచే తప్పనిసరి పత్రాలతో పాటు దరఖాస్తును స్వీకరించండి . |
| 2 & 3 వ రోజు | WEA / WWDS దరఖాస్తుదారు వివరాల నిర్ధారణ కోసం భౌతిక ధృవీకరణను చేపట్టాలి మరియు ధృవీకరించబడిన డేటాను అప్డేట్ చేసి GSWS పోర్టల్‌లో తప్పనిసరి పత్రాలను అప్‌లోడ్ చేయాలి. |
| 4 & 5 వ రోజు | ఎంపిడిఓ / మున్సిపల్ కమిషనర్ లు దరఖాస్తులను పరిశీలిస్తారు. మరలా ధృవీకరణ అవసరమైతే WEA / WWDS కు పంపబడుతుంది. |
| 6 & 7 వ రోజు | అంగీకరించిన మరియు తిరస్కరించబడిన ముసాయిద దరఖాస్తులను సామాజిక తనిఖీ కోసం GSWS నోటీసు బోర్డులో ఉంచబడుతుంది. మరియు దరఖాస్తుదారుల నుండి అభ్యంతరాలను కూడా స్వీకరిస్తుంది. |
| 8 & 9 వ రోజు | ఎంపిడిఓ / మున్సిపల్ కమిషనర్ జాగ్రత్తగా పరిశీలించి ధృవీకరించిన తరువాత అభ్యంతరాలు పరిష్కరించబడును. |
| 10 వ రోజు | అంగీకరించిన దరఖాస్తులకు మంజూరు ఉత్తర్వులను పెన్షన్ పాస్ బుక్, కార్డు మరియు HCM లేఖతో పాటు లబ్ధిదారునకు వాలంటీర్ ద్వారా అందజేస్తారు. తిరస్కరించబడిన దరఖాస్తుల కోసం తుది చర్యలతో పాటు ఉత్తర్వులు అందజేయబడతాయి. |

**ఉద్దేశ్యము :**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 45 నుండి 60 సంవత్సరాల మధ్య వయస్సు కలిగిన ఎస్.సి., ఎస్.టి., బి.సి. మరియు మైనారిటీ మహిళల కుటుంబాల పేదరికం, ఆర్థిక వెనుకబాటు తనాన్ని రూపు మాపి వారి యొక్క కుటుంబ జీవన ప్రమాణాలను మెరుగు పరుచుకోనుటకు చేయుతనిస్తూ , వారికి సుస్థిరమైన జీవనోపాధులను ఏర్పాటుతో పాటు, మార్కెటింగ్ సదుపాయాలు సమకూర్చటమే ఈ పథకము యొక్క ముఖ్య ఉద్దేశము.

**లక్ష్యము:**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని సుమారు 25 లక్షల వెనుకబడిన బడుగు బలహీన వర్గాల మరియు మైనారిటి మహిళల ఆర్థికాభివృద్ధితోపాటు, సుస్థిర జీవనోపాధి మరియు మహిళా సాధికారత సాధించడమే రాష్ట్ర ప్రభుత్వము యొక్క లక్ష్యం.

**పథకము అమలు విధానము .**

**వై.యస్.ఆర్ చేయూత పథకము అమలుకు ప్రభుత్వము G.O. MS NO 636, తేది 12.6.2020 న విడుదల చేయడము జరిగింది.**

వై.యస్.ఆర్ చేయూత పథకము అర్హతలు

| క్ర.సంఖ్య | విషయము | ఉండవలసిన అర్హతలు |
|---|---|---|
| 1 | **కుటుంబము** | భార్య,భర్త, పిల్లలు, లబ్ది దారుల మీద ఆధారపడిన కుటుంబ సభ్యులు |

| | | |
|---|---|---|
| 2 | ఎవరికి వర్తిస్తుంది | BC,SC,ST మరియు మైనారిటీ మహిళలకు |
| 3 | వయస్సు | 12.6.2020 నాటికి 45 సంవత్సరాలు నుండి 60 సంవత్సరాలు వయస్సు కలిగిన మహిళలకు |
| 4 | కుటుంబ ఆదాయము | గ్రామీణ ప్రాంతాలలోని మహిళల కుటుంబానికి సంవత్సర ఆదాయము రూ.10000/-లోపల, పట్టణ ప్రాంతాలలోని మహిళలకు రూ.12000/-. లోపల ఉండవలెను |
| 5 | కుటుంబానికి ఉండవలసిన భూమి | తడి భూమి 3 ఎకరాలు. మెట్ట భూమి 10 ఎకరాలు లేదా తడి మరియు మెట్ట భూమి కలిపి 10 ఎకారాల లోపల ఉండవలెను. |
| 6 | మునిసిపాలిటి | మునిసిపాలిటి ప్రాంతాలలో ఇంటి స్థలము కాని మరియు కమర్షియల్ స్థలము కాని 1000 Sq ఫీట్ స్థలము కంటే మించరాదు. |
| 7 | వాహనము | నాలుగు చక్రాల సొంత వాహనము ఉండరాదు ( టాక్సీ, ట్రాక్టర్ మరియు ఆటో వారికి వర్తించదు). |
| 8 | విద్యుత్ | నెల వారి కుటుంబ విద్యుత్ వినియోగము 300 యూనిట్ కంటే తక్కువ వినియోగము కలిగి ఉండవలెను. |
| 9 | ఉద్యోగము | కుటుంబములో ఎటువంటి ప్రభుత్వ ఉద్యోగమూ కాని లేక పదవి విరమణ పించను పొందుతున్నవారు అనర్హులు |
| 10 | ఆదాయపు పన్ను | కుటుంబము సభ్యులలో ఆదాయపు పన్ను చెల్లింపు దారులు ఉండకూడదు. |

## వై.యస్.ఆర్ చేయూత పధకము-లబ్దిదారుల ఎంపిక విధానము:

- గ్రామ/వార్డ్ వాలంటీర్ ద్వారా అర్హత కలిగిన మహిళను యాప్ ద్వారా సమాచార సేకరణ చేయడము జరిగింది.
- గ్రామ/వార్డ్ వాలంటీర్ ద్వారా సేకరించన సమాచారమును గ్రామ/వార్డ్ సంక్షేమ సెక్రటరీ మరొక సారి పరిశీలించడము జరుగుతుంది.

- ❖ గ్రామ/వార్డ్ సంక్షేమ సెక్రటరీ సేకరించిన సమాచారమును బట్టి సామాజిక తనిఖీ కొరకు ప్రతి గ్రామ/వార్డ్ సచివాలయములో ప్రదర్శించడము జరిగింది.

- ❖ గ్రామ/వార్డ్ సంక్షేమ సెక్రటరీ ద్వారా తాత్కాలిక అర్హత కలిగిన లబ్ధిదారుల సమాచారమును మండల అభివృద్ధి అధికారికి మరియు మునిసిపల్ కమీషనర్ వారికి ఆన్లైన్ లో పంపడము జరిగింది .

- ❖ మండల అభివృద్ధి అధికారికి మరియు మునిసిపల్ కమీషనర్ సామాజిక తనిఖీ లో వచ్చిన పిర్యాదులను మరొకసారి పరిశీలించి తన లాగిన్ నందు అప్డేట్ చేసి తుది లబ్ధిదారుల జాబితాను తయారు చేయడము జరిగింది.

- ❖ మండల అభివృద్ధి అధికారికి మరియు మునిసిపల్ కమీషనర్ తుది వై.యస్.ఆర్ చేయూత లబ్ధిదారుల జాబితాను సంబందిత E.D కార్పోరేషన్ (SC,ST,BC మరియు మైనారిటీ) వారికి సమర్పించడము జరిగింది.

- ❖ E.D, SC,ST,BC మరియు మైనారిటీ కార్పోరేషన్ వారు తుది వై.యస్.ఆర్ చేయూత లబ్ధిదారుల జాబితాను సంబందిత జిల్లా కలెక్టర్ వారికి పంపించి వారి ఆమోదము పొందడము జరుగింది.

- ❖ జిల్లా కలెక్టర్ వారి ద్వారా ఆమోదము పొందిన లబ్ధిదారుల జాబితాను CEO SERP కార్యాలయానికి ఆన్లైన్ ద్వారా పొందడము జరుగింది.

- ❖ CEO-SERP వారు కార్పోరేషన్ వారిగా తుది లబ్ధిదారుల జాబితా ప్రకారము నిధులను ప్రభుత్వము నుండి సమకూర్చుకొని CFMS కు లబ్ధిదారుల జాబితాను పంపడము జరుగింది..

❖ గౌరవ ముఖ్యమంత్రి శ్రీ Y.S జగన్ మోహన్ రెడ్డి గారి చేతుల మీదుగా తేది.12.08.2020 న అక్క,చెల్లెమ్మల బ్యాంక్ అకౌంట్ కు నిధులను జమ చేయడము జరిగింది.

- ఈ పథకం ద్వారా దేశంలో ఎక్కడా లేని విధంగా బడుగు, బలహీన వర్గాలు, మైనార్టీలకు చెందిన దాదాపు 23 లక్షల మంది మహిళలకు 4 ఏళ్లలో రూ.17250 కోట్ల లబ్ది చేకూరనుంది. మహిళలు జీవనోపాధి పొందే మార్గాలపై ఈ సహాయాన్ని వినియోగించుకుంటే వారి సామర్థ్యాన్ని పెంచడంతో పాటు మార్కెటింగ్ , సాంకేతికపరమైన సహకారాన్ని అందించేలా ప్రభుత్వం చేయుతనిస్తుంది .
- ప్రభుత్వం అందిస్తున్న సహాయం ద్వారా మహిళల్లో ఆర్థిక సుస్థిరత, తద్వారా మహిళల ఆర్థిక వ్యవస్థ ప్రగతికి తోడ్పాటునందిస్తుంది.
- వ్యవసాయం, పశు పోషణ, చేనేత, హస్తకళలు, ఆహార ఉత్పత్తుల తయారీ , కిరాణా దుకాణాలు, చిరు వ్యాపారాలు , తదితర రంగాలల్లో ఉన్న మహిళలకు బలమైన తోడ్పాటు అందించడం తో పాటు వారి జీవనోపాధి అవకాశాలు మరింత మెరుగుపడనున్నాయి.
- **ఈ దిశగా మహిళలకు అవసరమైన సాంకేతిక , మార్కెటింగ్ సహకారాలు అందించేలా ఇప్పటికే అమూల్, ఐటీసీ, హెచ్ యు ఎల్, పి&జీ మరియు రిలయన్స్ లాంటి ప్రఖ్యాత, దిగ్గజ కంపెనీలతో ప్రభుత్వం అవగాహనా ఒప్పందాలు కుదుర్చుకుంది. ఈ కంపనీలతోనే కాకుండా భవిష్యత్తులో మరికొన్ని ప్రపంచ ప్రఖ్యాత కలిగిన భహుళ కంపనీలతో మహిళల వ్యాపార సామర్థ్యాన్ని పెంచుటకు ఒప్పందాలు చేసుకోవడము జరుగుతుంది.**
- ఈ కంపెనీల ద్వారా మహిళలకు స్థిరమైన ఆదాయం కల్పించేలా జీవనోపాధి కలగడంతో పాటు గ్రామీణ మరియు పట్టణ స్థాయిలో కార్యకలాపాలు పుంజుకొని అదనంగా దాదాపు 2.25 లక్షల మందికి ఉపాధి అవకాశాలు ఏర్పడతాయి.
- ఇందులోభాగంగా రిటైల్ రంగంలో దుకాణాలు నడుపుకుంటున్న వై.యస్.ఆర్.చేయూత పథకం లబ్ధిదారులైన మహిళలను గుర్తించి **.హెచ్‌యూల్, ఐటీసీ, పీ అండ్ జీ కంపెనీల** సేవలు కలిగిన

ప్రాంతాలలో ఉన్న వ్యాపారము చేసే మహిళలను గుర్తించి అనుసంధానము చేయడము జరుగుతుంది.

### *భహుళ జాతి కంపినీల సహకారము (హిందూస్తాన్ యూనిలీవర్, ఐటీసీ, పీ అండ్ జీ)*

- ఇన్వెంటరీ మేనేజ్‌మెంట్, స్టాకింగ్ మేనేజ్‌మెంట్‌లో వారికి శిక్షణ ఇస్తారు.
- భాగస్వాములైన కంపెనీలు ఏం చేస్తాయంటే...
- మహిళకు చేయూతనిచ్చే కార్యక్రమాల్లో ఎంఓయూలు (MOU) కుదుర్చుకున్న కంపెనీలు కీలకంగా వ్యవహరిస్తాయి.
- లబ్ధిదారులైన మహిళలు ఉన్న ప్రాంతాల్లో తమ సేవల కలిగిన ప్రాంతాలను గుర్తిస్తాయి.
- ఉత్పత్తుల కొనుగోలులో వారికి తోడ్పాటు అందిస్తాయి.
- కిరణా వ్యాపారం చేసే వారికి శిక్షణ ఇస్తాయి. వారిలో వ్యాపార సామర్థ్యాన్ని పెంచుతాయి.
- గుర్తించిన క్లస్టర్లలో కార్పొరేట్ కార్యక్రమాలతో సుస్థిర ఆదాయాలకు ప్రణాళికను అమలు చేస్తాయి.

**మహిళా లబ్దిదారులను గుర్తించుట లో తీసుకోవలసిన జాగ్రత్తలు :**

- "వై.యెస్.ఆర్. చేయూత" లబ్దిని ఉపయోగించుకుని యూనిట్ పెట్టటానికి ఆసక్తి కలిగి ఉండాలి.
- పైన తెలిపిన కంపెనీలతో అనుసంధానం చేసుకుని వారి ఆధ్వర్యములో ఉత్పత్తులను తయారు చేయటం లేదా మార్కెటింగ్ చేసుకోవటానికి ఒప్పందము చేసుకోవలసి ఉంటుంది.
- పాడి పరిశ్రమ – పాల ఉత్పత్తి యూనిట్లు పెట్టటానికి ఆసక్తి ఉన్నవారు.
- గృహ మరియు ఆరోగ్యమునకు (జనరల్ స్టోర్ , కిరాణా మరియు ఆహార) సంబంధమైన ఉత్పత్తులు తయారీ యూనిట్లు పెట్టటానికి ఆసక్తి ఉన్నవారు.
- కూరగాయలు, పూలు మరియు పండ్ల తోటలు పెంపకము నకు అవకాశము మరియు ఆసక్తి వున్నవారు.
- వ్యవసాయం మరియు అనుబంధ కార్యక్రమాలు.
- వస్త్ర, చేనేత మరియు చేతి వృత్తులకు సంబంధించిన ఉత్పత్తులు
- అగరుబత్తీలు తయారీ

➢ కోళ్ళ పెంపకము మొదలైనవి.

లబ్దిదారులు ఎంపిక చేసుకున్న యూనిట్ ప్రస్తుతము ఉన్నది అయితే దానిని అభివృద్ధి చేసుకోవటానికి లేదా నూతనముగా ఏర్పాటు చేసుకోవటానికి కాని రూ.75,000/- లు మంజూరు చేయబడతాయి. దానిలో ఒక వంతు రూ.18,750/-లు లబ్దిదారుని వాటా కాగా (వై.యెస్.ఆర్. చేయూత పథకము ద్వారా వచ్చిన మొదటి విడత మొత్తము) మిగిలిన 3 వంతులు రూ. 56,250/-లను బ్యాంకు నుండి ఋణము మంజూరు చేయబడుతుంది. ఆ ఋణమును సభ్యులు వారి ఆదాయమును బట్టి నెలవారీ వాయిదాలు నిర్ణయించుకుని అసలు మరియు వడ్డీతో సహా బ్యాంకునకు చెల్లించవలసి ఉంటుంది.

## ఆప్షన్ ఫార్మ్ నింపడానికి సూచనలు (SOP)

| క్రమ సంఖ్య | విషయము | వివరణ | భాద్యత |
|---|---|---|---|
| 1 | వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక పత్రం | YSR చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక కొరకు ఆప్షన్ తయారు చేయుట | SERP |
| 2 | వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక పత్రం ప్రింటింగ్ | ప్రతి జిల్లలో ఉన్న మండలాల వారిగా, YSR చేయూత లబ్ది దారులను బట్టి సంఖ్యను బట్టి ప్రింటింగ్ జిల్లా స్థాయిలో చేసుకోవాలి.ప్రింటింగ్ కొరకు సున్నా వడ్డీ కి ఇచ్చిన మార్గ దర్శకాలను అమలు చేసుకోవాలి | DPM(LH) |
| 3 | శిక్షణ | వై.యస్.ఆర్ చేయూత పైన అవగాహన మరియు లబ్దిదారుల జీవనోపాధుల పత్రమును ఎలా నింపాలి, | DPM( LH) |
| 4 | పంపిణి | HCM లేఖ మరియు వై.యస్.ఆర్ చేయూత లబ్దిదారుల జీవనోపాధుల ఎంపిక పత్రం | VOA,గ్రామ/వార్డ్ వాలంటీర్ |
| 5 | అవగాహన | గ్రామ స్థాయిలో వై.యస్.ఆర్ చేయూత పైన | VOA,గ్రామ/వార్డ్ |

| | | | |
|---|---|---|---|
| | | | వాలంటీర్ |
| 6 | యాప్ | యాప్ తయారీ | APCFSS |
| 7 | లబ్దిదారుల యొక్క జీవనోపాధుల పత్రాల సేకరణ | లబ్దిదారుల యొక్క జీవనోపాధుల పైన అవగాహన్ కల్పించి వారి యొక్క సమ్మతి పత్రాల సేకరణ | VOA,గ్రామ/వార్డ్ వాలంటీర్ |
| 8 | లబ్దిదారుల సమ్మతి పత్రాలు భద్రపరుచుట | లబ్దిదారులు ఏ కార్యక్రమాలను చేపడుతున్నారు క్రోడీకరించుట | గ్రామ/వార్డ్ సెక్రటరీ WEA |
| 9 | సమాచారము నమోదు | లబ్ది దారుల సమాచారాన్ని డేటా ఎంట్రి చేయుట | గ్రామ/వార్డ్ సెక్రటరీ డిజిటల్ అసిస్టెంట్ |
| 10 | పర్యవేక్షణ | మండల స్థాయిలో కార్యక్రమాల పర్యవేక్షణ | APM మరియు CC |

**YSR చేయూత జీవనోపాదులు నమోదు కొరకు— కార్యాచరణ ప్రణాళిక :**

- గౌ. ముఖ్యమంత్రి వారి లెటర్ మరియు జీవనోపాదుల ఎంపిక పత్రము తీసుకుని గ్రామసంఘం అసిస్టెంట్(VOA)/పట్టణ ప్రాంత రిసోర్స్ పర్సన్ (RP) మరియు గ్రామ/వార్డు వాలంటీరు "YSR చేయూత" లబ్దిదారుల దగ్గరికి వెళ్ళాలి.
- గౌ. ముఖ్యమంత్రి వారి లెటర్ పూర్తిగా లబ్దిదారులకు చదివి వినిపించిన తరువాత లబ్దిదారుల నుండి వారు ఏ రకమైన జీవనోపాదులు చేపట్టి, ఏ కంపెనీల తో అనుసంధానం చేసుకుంటారు అనే విషయాన్ని వారి దగ్గర అడిగి తెలుసుకుని "ఎంపిక పత్రము" నింపాలి.
- "YSR చేయూత" పథకము ద్వారా వచ్చిన మొత్తము వారు ఎంపిక చేసుకున్న జీవనోపాదికి సరిపోదు అనుకుంటే అదనముగా రూ. 56,250/- లు బ్యాంకు నుండి ఋణముగా మంజూరు చేయించటం జరుగుతుంది.
- ఎంపిక పత్రము తో పాటు గౌ. ముఖ్యమంత్రి వారి లెటర్ లబ్దిదారునికి అందినట్లుగా రసీదు తీసుకుని, ఆయా రసీదులను మండల సమాఖ్య కార్యాలయము నందు భద్రపరచాలి.
- ఎంపిక పత్రమును గ్రామ/వార్డు సచివాలయము నందు ఉన్న వెల్ఫేర్ మరియు విద్య కార్యదర్శి వారికి అందచేసి వాటిని గ్రామ/వార్డు సచివాలయలమునందు ఉన్న "డిజిటల్ అసిస్టెంట్" వారికి ఇచ్చి ఆన్లైన్ నందు నమోదు చేయించాలి.
- ఏ రోజు, ఎన్ని ఎంపిక పత్రములు పూర్తి చేశారు అనే విషయమును గ్రామసంఘం అసిస్టెంట్(VOA)/పట్టణ ప్రాంత రిసోర్స్ పర్సన్ (RP) ద్వారా క్లస్టర్-కో-ఆర్డినేటర్(CC)/కమ్యూనిటీ ఆర్గనైజర్(CO) వారి ద్వారా సమాచారమును సేకరించి క్రోడీకరించి మండల/మునిసిపల్ వారిగా, జిల్లా వారీగా SPMU నకు ప్రతి రోజు పంపించ వలయును.

**గ్రామసంఘం అసిస్టెంట్(VOA)/పట్టణ ప్రాంత రిసోర్స్ పర్సన్ (RP) మరియు గ్రామ/వార్డు వాలంటీరు శిక్షణలో చెప్పవలసిన వివరములు :**

"YSR చేయూత" మంజూరు అయిన మొత్తము రూ. 18,750/- పెట్టుబడిగా పెట్టుకుని ప్రస్తుతము వారి వద్దనున్న జీవనోపాదులను అభివృద్ధి చేసుకుంటూ మరియు నూతనముగా యూనిట్లు ఏర్పాటు చేసుకోవటానికి కావలసిన ఆర్ధిక సహాయమును బ్యాంకుల నుండి మంజూరు చేయించుటకు అవకాశము ఉన్నది. లబ్దిదారులు ఎంచుకున్న జీవనోపాదులను అభివృద్ధి చేయడానికి ప్రభుత్వము వివిధ బహుళ జాతి సంస్థలతో ఒప్పందాలు చేసుకునే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇప్పటి వరకూ ఈ క్రింది సంస్థలతో రాష్ట్ర ప్రభుత్వము ఒప్పందం చేసుకోవటం జరిగింది.

1. అమూల్, 2. ప్రోక్టర్ &గ్యాంబల్, 3. హిందుస్థాన్ యూని లీవర్ మరియు 4. ఐ.టి.సి కంపెనీలు
   - ❖ కావున "వై.యెస్.ఆర్. చేయూత" లబ్దిదారులు ఎవరైతే ఈ క్రింద తెలిపిన కంపెనీల వారితో అనుసంధానము చేసుకుని యూనిట్లు ఏర్పాటు చేసుకోవటానికి ఆసక్తి కలిగి ఉన్నారో వారిని గుర్తించి, వారి దగ్గర నుండి ఎంపిక పత్రము లబ్దిదారుల నుండి సేకరించి ఆయా సమాచారమును గ్రామ/వార్డు సచివాలయము నందు ఉన్న వెల్ఫేర్ మరియు విద్య కార్యదర్శి వారికి అందచేసి వాటిని గ్రామ/వార్డు సచివాలయలమునందు ఉన్న "డిజిటల్ అసిస్టెంట్" వారికి ఇచ్చి ఆన్లైన్ నందు నమోదు చేయించాలి.

సచివాలయము వారికి వారికి ఇచ్చిన మొబైల్ అప్లికేషను నందు నమోదు చేస్తూ ఆయా దరఖాస్తులను మండల సమాఖ్య కార్యాలయమునందు భద్రపరచవలసి ఉంటుంది.

**"వై.యెస్.ఆర్. చేయూత" లబ్దిని ఉపయోగించుకుని యూనిట్ పెట్టటానికి ఆసక్తి కలిగి ఉండాలి**

- ❖ పాడి పశువులు – అమూల్ సంస్థ
- ❖ జనరల్ స్టోర్, కిరాణా మరియు సంబంధమైన ఉత్పత్తులు – ప్రోక్టర్ అండ్ గ్యాంబల్ మరియు హెచ్.యు.ఎల్.
- ❖ కూరగాయలు, పూలు మరియు పండ్ల తోటలు పెంపకము – రిలయన్సు
- ❖ అగరుబత్తీలు తయారీ – ఐ.టి.సి.
- ❖ గోర్రేలు, మేకలు
- ❖ ఇతరములు

గమనిక : **ఏ రకమైన జీవనోపాదిని ఎంచుకోవాలి మరియు ఈ లబ్దిని ఏ విధంగా ఉపయోగించుకోవాలి అనేది లబ్దిదారునికి పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. ఎంపిక పత్రమును లబ్దిదారుని ఇష్ట పూర్వకముగానే నింపే విధముగా చూడాలి.**

# వై.యస్.ఆర్ ఆసరా పథకం:

## గౌరవ ముఖ్యమంత్రి గారి విజన్ :

స్వయం సహాయక సంఘ అక్క చెల్లమ్మలు పడుతున్న ఆర్థిక ఇబ్బందులను **"ప్రజా సంకల్పయాత్ర"** లో చూసి చలించి పోయిన గౌరవ ముఖ్యమంత్రి గారు వారి ఉజ్వల భవిష్యత్ కోసం **"వై.యస్.ఆర్ ఆసరా"** పథకాన్ని ఈ ప్రభుత్వం యొక్క ప్రధాన కార్యక్రమమైన "నవరత్నాల" లో చేర్చడం జరిగినది.

## పథకం ముఖ్యమైన ఉద్దేశం:

ఈ పథకం వల్ల మహిళా సాధికారత మరింత మెరుగుయి, గ్రామీణ మరియు పట్టణ ప్రాంతాలలోని స్వయం సహాయక సంఘాలలోని పేద మహిళల యొక్క ఆర్థిక పురోగతికి దోహదపడుతుంది. ఈ ప్రభుత్వం తీసుకొన్న ఈ నిర్ణయం ద్వారా అక్క చెల్లమ్మలు ఆర్థికంగా అభివృధి చెంది వారి కుటుంబాలు ఆనందంగా ఉంటాలానే ఉద్దేశం తో ఈ పథకంను తీసుకొనిరావడం జరిగినది.

## ఈ పథకం క్రింద ఎవరు అర్హులు :

- వాణిజ్య మరియు సహకార బ్యాంకులలో ఋణం తీసుకొని తేది 11.04.2019 నాటికి అప్పు నిల్వ ఉన్న అన్ని మహిళా స్వయం సహాయక సంఘాలు ఈ పథకం లో అర్హులు.
- తేది 11.04.2019 నాటికి అక్క చెల్లమ్మలకు ఉన్న పొదుపు సంఘాల బ్యాంకు రుణాల అప్పు నిల్వ మొత్తం సొమ్మును 4 దఫాలుగా నేరుగా వారి సంఘం పొదపు ఖాతా లకు జమ చేయడానికి ఈ ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం జరిగింది.

- వై.యస్.ఆర్ ఆసరా క్రింద 4 విడతలుగా ఇవ్వబోవు మొతాన్ని వివిధ కార్పొరేషన్ల ద్వారా (యస్.సి,యస్.టి,బిసి,ఈబిసి,కాపు,మైనారిటీ,క్రిస్టియన్) ఇవ్వడం జరుగుతుంది.

## ఈ పథకం క్రింద అందించు మొత్తం :

- ఈ పథకం కింద రాష్ట్రంలోని 7,91,257 పొదుపు సంఘాల్లో ఉన్న 78,27,693 మంది అక్కచెల్లెమ్మలకు తేది 11.04.2019 నాటికి వారి సంఘాలలో ఉన్న అప్పు నిల్వ మొత్తం రూ.25,383.49 కోట్ల నేరుగా నాలుగేళ్లలో అక్కచెల్లమ్మల సంఘం పొదుపు ఖాతాల్లో జమచేయడం జరుగుతుంది.
- మొదటి విడతగా రూ.6,345.87 కోట్ల రూపాయలను నేరుగా సెప్టెంబర్ 11 వ తేది న మన గౌరవ ముఖ్యమంత్రి శ్రీ. జగన్ మోహన్ రెడ్డి గారు అక్కచెల్లమ్మల సంఘాల పొదుపు ఖాతాలకు జమ చేసే రోజు చరిత్రలో నిలిచిపోయే రోజు ఈ రోజు.....

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము




# వెల్ఫేర్ & ఎడ్యుకేషన్ అసిస్టెంట్ల కొరకు

# బి.సి, ఎస్.సి, ఎస్.టి & మైనారిటీల రాజకీయ మరియు ఆర్థిక ఎదుగుదల కొరకు ప్రభుత్వం చేసిన నూతన చట్టాల సంక్షిప్త వివరములు

## వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ

# చేయబడిన చట్టాలు

ఇటీవలి కాలంలో నూతన ప్రభుత్వం బి.సి, ఎస్.సి, ఎస్.టి & మైనారిటీల రాజకీయ మరియు ఆర్థిక ఎదుగుదల కొరకు 5 నూతన చట్టాలను తీసుకురావడం జరిగినది. ఈ చట్టాలు సంబంధిత వర్గాల ఎదుగుదలలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకువస్తాయనడంలో సందేహం లేదు. వాటి వివరములు దిగువ తెలియ పరచడమైనది.

1) బి.సి. కమీషన్‌ను శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు చేయు నిమిత్తం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే
**యాక్టు నెం. 19 ఆఫ్ 2019**.

2) నామినేటెడ్ పదవులలో బి.సి, ఎస్.సి, ఎస్.టి & మైనారిటీల రాజకీయ ఎదుగుదల కొరకు 50 శాతం రిజర్వేషన్‌ను కల్పించడం.
**(యాక్ట్ నెం. 24)**

3) నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులలో మరియు నామినేటెడ్ సర్వీసు కాంట్రాక్టులలో బి.సి, ఎస్.సి, ఎస్.టి & మైనారిటీల ఆర్థిక ఎదుగుదల కొరకు 50 శాతం రిజర్వేషన్‌ను కల్పించడం.
**(యాక్ట్ నెం. 25)**

4) నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులలో మరియు నామినేటెడ్ సర్వీసు కాంట్రాక్టులలో మహిళల ఆర్థిక ఎదుగుదల కొరకు 50 శాతం రిజర్వేషన్‌ను కల్పించడం.
**(యాక్ట్ నెం. 26)**

5) నామినేటెడ్ పదవులలో మహిళల రాజకీయ ఎదుగుదల కొరకు 50 శాతం రిజర్వేషన్‌ను కల్పించడం.
**(యాక్ట్ నెం. 27)**

# <u>శాశ్వత ప్రాతిపదికన బి.సి. కమీషన్ ఏర్పాటు</u>
# <u>(యాక్టు నెం. 19 ఆఫ్ 2019)</u>

- బి.సి. కమీషన్‌ను శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు చేయు నిమిత్తం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే **యాక్టు నెం. 19 ఆఫ్ 2019**.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 61, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 వ తేదీన అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 66, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 30-08-2019 వ తేదీన జారీ చేయడం జరిగినది.
- గౌరవనీయులు రిటైర్డ్ జస్టిస్ శ్రీ ఎ. శంకర నారాయణ గారిని బి.సి. కమీషన్ ఛైర్మన్‌గా నియమిస్తూ జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 73, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 12-09-2019 వ తేదీన ఉత్తర్వులను ప్రభుత్వం జారీ చేయడం జరిగినది.

**<u>బి.సి. కమీషన్ కార్యకలాపాలు :</u>**

- వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చమని వివిధ కులాల వారు చేయు అభ్యర్థనలను పరిశీలించడం.
- వెనుకబడిన తరగతుల జాబితాలో ఇదివరకే ఉన్న కులాల నుండి వచ్చు గ్రూపు మార్పిడి అభ్యర్థనలను పరిశీలించడం.
- వెనుకబడిన తరగతుల జాబితాలో క్రొత్తగా కులాలను చేర్చుట పైన (అండర్ ఇంక్లూజన్) మరియు జాబితాలో ఇదివరకే ఉన్న కులాల తొలగింపు పైన (ఓవర్ ఇంక్లూజన్) వచ్చు ఫిర్యాదులను పరిశీలించడం.
- విద్యా సంస్థల ప్రవేశాలలో మరియు ఉద్యోగ నియామకాలలో రూల్ ఆఫ్ రిజర్వేషన్‌ను అమలు పరచడంలో వచ్చు ఫిర్యాదులను పరిశీలించడం.
- నిర్దేశించబడిన కాల వ్యవధి ప్రకారం వెనుకబడిన తరగతుల విద్య, సామాజిక మరియు ఆర్థిక ప్రగతిని తగు సర్వే ద్వారా పరిశీలించడం.
- వెనుకబడిన తరగతులు సాధించు పురోగతి మరియు అభివృద్ధి స్థాయిలను అంచనా వేయడం.
- వెనుకబడిన తరగతులకు చెందిన వివిధ కులాలు సాధించు పురోగతి మరియు అభివృద్ధి స్థాయిలను పోల్చడం, ఏవైనా కులాలు తగినంతగా పురోగతి మరియ అభివృద్ధి సాదించలేక వెనుకబడి పోవడాన్ని గమనించిన ఎడల, అట్టి కులాలను వెనుకబడిన తరగతులలోనే ప్రత్యేకంగా గుర్తించి వారిని అత్యంత వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చడానికి సిఫారసు చేయడం.
- వెనుకబడిన తరగతులకు చెందిన కులాలలో కొన్నింటిని అత్యంత వెనుకబడిన తరగతులుగా గుర్తించడం జరిగినది. మొత్తం 139 కులాలు వెనుకబడిన తరగతుల జాబితాలో ఉండగా, 32 కులాలు అత్యంత వెనుకబడిన జాబితాలో చేర్చబడి ఉన్నవి. పేరుకు తగ్గట్టుగా ఈ 32 కులాలు అన్ని రంగాలలోనూ వెనుకబడిన తరగతులలోని ఇతర కులాల కంటే కూడా ఇంకా వెనుకబడి ఉన్నవన్నమాట. కనుక, వాటి అభివృద్ధికి అవసరమైన రక్షణాత్మక చర్యలను చేపట్టుటకు తగిన సూచనలు, సలహాలు ఇవ్వడం.
- వెనుకబడిన తరగతులకు చెందిన వారిపైన చోటు చేసుకునే అట్రాసిటీస్ మీద మరియు సామాజిక బహిష్కరణల పైన తగు విచారణ జరపడం.

పైన తెలియజేసిన అంశములపై బి.సి. కమీషన్ తగు పరిశీలన / అధ్యయనం అనంతరం తన సూచనలు, సలహాలు మరియు సిఫారసులతో కూడిన నివేదికను ప్రభుత్వమునకు అందజేస్తుంది. ఆ నివేదికను పరిశీలించి, ప్రభుత్వం తగు చర్యలను చేపట్టడం జరుగుతుంది.

## 1) బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ పదవులలో 50 % రిజర్వేషన్ కల్పించుట (యాక్టు నెం. 24 ఆఫ్ 2019) :

- బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ పదవులలో 50 % రిజర్వేషన్ కల్పించు నిమిత్తం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే **యాక్టు నెం. 24 ఆఫ్ 2019**.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 62 , వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 వ తేదీన అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 77, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 27-09-2019 వ తేదీన జారీ చేయడం జరిగినది.
- కల్పించబడిన 50% రిజర్వేషన్‌ను ఈ క్రింది విధంగా వివిద కేటగిరీల మధ్య విభజించడం జరుగుతుంది.

| | | |
|---|---|---|
| బి.సి మరియు మైనారిటీలు | - | 29%, |
| ఎస్.సి. | - | 15% |
| ఎస్.టి. | - | 6% |

- సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను ఈ చట్టాన్ని అమలు పరచుటకు నోడల్ శాఖగా ప్రభుత్వం గుర్తించి, తగు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది.

## 2) బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు మరియు సర్వీసు కాంట్రాక్టులలో 50 % రిజర్వేషన్ కల్పించుట (యాక్టు నెం. 25 ఆఫ్ 2019) :

- బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు మరియు సర్వీసు కాంట్రాక్టులలో 50 % రిజర్వేషన్ కల్పించు నిమిత్తం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే **యాక్టు నెం. 25 ఆఫ్ 2019**.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 63 , వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 వ తేదీన అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 74, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 16-09-2019 వ తేదీన జారీ చేయడం జరిగినది.
- కల్పించబడిన 50% రిజర్వేషన్‌ను ఈ క్రింది విధంగా వివిద కేటగిరీల మధ్య విభజించడం జరుగుతుంది.

| | | |
|---|---|---|
| బి.సి మరియు మైనారిటీలు | - | 29%, |
| ఎస్.సి. | - | 15% |
| ఎస్.టి. | - | 6% |

- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులకు సంబందించి పంచాయితీ రాజ్ శాఖను (పంచాయితీ రాజ్ డిపార్టుమెంట్), నామినేటెడ్ సర్వీసు కాంట్రాక్టులకు సంబంధించి సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను నోడల్ శాఖలుగా ప్రభుత్వం గుర్తించి, తగు అమలు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.
- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు పొందడానికి మరియు నామినేటెడ్ సర్వీస్ కాంట్రాక్ట్ పొందడానికి ఆయా వర్గాలకు చెందిన వారు సంబంధిత అధికారుల వద్ద రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి.
- రిజిస్ట్రేషన్ చేయించుకొనుట కొరకు, ఒక ప్రత్యేక డ్రైవ్‌ను (స్పెషల్ డ్రైవ్) చేపట్టడం జరుగుతుంది. ఈ వర్గాలకు చెందిన వారు రిజిస్ట్రేషన్ చేసుకొనుట కొరకు అవసరమైన సాల్వెన్సీ సర్టిఫికేటు మరియు ఎక్స్‌పీరియన్స్ సర్టిఫికేట్ విషయంలో మినహాయింపు ఇవ్వడమైనది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది. ఇందు కొరకు ఒక ప్రత్యేక 100 పాయింట్ల రోస్టర్‌ను కూడా అభివృద్ధి చేయడం జరిగినది.

## 3) మహిళలకు నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులలో మరియు సేవా ఒప్పందాలలో 50 % రిజర్వేషన్ కల్పించుట (యాక్టు నెం. 26 ఆఫ్ 2019) :

- మహిళలకు నామినేటెడ్ పలలో 50 % రిజర్వేషన్ కల్పించు నిమిత్తం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే **యాక్టు నెం. 26 ఆఫ్ 2019**.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 64 , వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 వ తేదీన అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 75, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 17-09-2019 వ తేదీన జారీ చేయడం జరిగినది.
- సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను ఈ చట్టాన్ని అమలు పరచుటకు నోడల్ శాఖగా ప్రభుత్వం గుర్తించి, తగు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది.
- మహిళలకు కేటాయించబడిన ఈ 50 శాతం రిజర్వేషన్‌ను సమాంతర రిజర్వేషన్ అంటారు. అనగా, వివిధ వర్గాలకు కేటాయించబడిన రిజర్వేషన్‌తో పాటు, ఓపెన్ కేటగిరీకి ఉన్న కోటాలోనూ 50 శాతం మహిళలకు కేటాయించడం జరుగుతుంది.
- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులకు సంబందించి పంచాయితీ రాజ్ శాఖను (పంచాయితీ రాజ్ డిపార్టుమెంట్), నామినేటెడ్ సర్వీసు కాంట్రాక్టులకు సంబంధించి సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను నోడల్ శాఖలుగా ప్రభుత్వం గుర్తించి, తగు అమలు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.
- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు పొందడానికి మరియు నామినేటెడ్ సర్వీస్ కాంట్రాక్ట్ పొందడానికి మహిళలు సంబంధిత అధికారుల వద్ద రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి.
- రిజిస్ట్రేషన్ చేయించుకొనుట కొరకు, ఒక ప్రత్యేక డ్రైవ్‌ను (స్పెషల్ డ్రైవ్) చేపట్టడం జరుగుతుంది. మహిళలు రిజిస్ట్రేషన్ చేసుకొనుట కొరకు అవసరమైన సాల్వెన్సీ సర్టిఫికేటు మరియు ఎక్స్‌పీరియన్స్ సర్టిఫికేట్ విషయంలో మినహాయింపు ఇవ్వడమైనది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది. ఇందు కొరకు ఒక ప్రత్యేక 100 పాయింట్ల రోస్టర్‌ను కూడా అభివృద్ధి చేయడం జరిగినది.

## 4) మహిళలకు నామినేటెడ్ పదవులలో 50 % రిజర్వేషన్ కల్పించుట (యాక్టు నెం. 27 ఆఫ్ 2019) :

- మహిళలకు నామినేటెడ్ పదవులలో 50 % రిజర్వేషన్ కల్పించు నిమిత్తం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే **యాక్టు నెం. 27 ఆఫ్ 2019**.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 65, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 వ తేదీన అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 76, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 27-09-2019 వ తేదీన జారీ చేయడం జరిగినది.
- మహిళలకు కేటాయించబడిన ఈ 50 శాతం రిజర్వేషన్‌ను సమాంతర రిజర్వేషన్ అంటారు. అనగా, వివిధ వర్గాలకు కేటాయించబడిన రిజర్వేషన్‌తో పాటు, ఓపెన్ కేటగిరీకి ఉన్న కోటాలోనూ 50 శాతం మహిళలకు కేటాయించడం జరుగుతుంది.
- సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను ఈ చట్టాన్ని అమలు పరచుటకు నోడల్ శాఖగా ప్రభుత్వం గుర్తించి, తగు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది.

---

**గమనిక :** వివిధ సామాజిక వర్గాలకు మరియు మహిళలకు కేటాయించబడిన రిజర్వేషన్ అమలుకు సంబంధించిన నివేదికలను ఆయా నోడల్ శాఖలు సంబంధిత సంక్షేమ శాఖలకు మరియు మహిళా, శిశు సంక్షేమ శాఖకు అందించవలెను.








# *Presentation on Minorities Welfare Department Schemes*



# పేష్ ఇమమ్ మరియు మౌజాన్లకు గౌరవ వేతనము

## అర్హతలు :

1. రాష్ట్ర వక్ఫ్ బోర్డులో నమోదు/నోటిఫైడ్ చేయబడిన మసీదులలో సేవలను అందిస్తున్న పేష్ ఇమాములు మరియు మౌజాన్లు మాత్రమే అర్హులు.
2. సంబదిత నిర్వాహకులు అనగా, ముతవల్లి /మేనేజ్మెంట్ కమిటి పేష్ ఇమాములు మరియు మౌజాన్ ల అబ్యార్థిత్వాన్ని దృవికరించి ప్రతిపాదించాలి.
3. ఇమాం మరియు మౌజాన్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందినవారు అయి ఉండాలి.
4. ఇతర రాష్ట్రాలకు చెందిన పేష్ ఇమము మరియు మౌజానులు అయితే సరైన గుర్తింపు రుజువు (3) సంవత్సరలకు తక్కువ కాకుండా మరియు ఒకే మసీదులో సేవలను అందించే వ్యక్తులు అయి ఉండాలి.
5. వారు మసీదు ఉన్న స్థానిక ప్రాంత నివాసితులు అయి ఉండాలి.
6. వారు ఈ క్రింది వాటిని కలిగి ఉండాలి.

i. ఆదార్ కార్డు

ii. చిరునామా రుజువు (క్రింది వాటిలో ఏదైనా )

(ఎ) గృహ సరఫరా కార్డు'

(బి)ఇండియన్ పాస్ పోర్ట్

(సి) డ్రైవింగ్ లైసెన్స్




# పేష్ ఇమమ్ మరియు మౌజాన్లకు గౌరవ వేతనము

అర్హతలు :

7. నికర ఆదాయం ఉన్న మసీదులో పనిచేస్తున్నపేష్ ఇమాం మరియు మౌజాన్లు ఈ పథకానికి అర్హులు కారు.

8. వారు మసిదులలో పూర్తి సమయం సర్వీసు రెండేర్లు గా ఉండాలి పార్ట్ టైం లేదా రోజుకు ఒకటి లేదా రెండు ప్రార్థనలు కోసం సేవలను చేయడం లేదా పండగలు ఈద్గాహ్ మొదలైన వాటిలో ప్రత్యేక ప్రార్థనలు చేస్తున్న వారు ఈ పథకం క్రింద అర్హులు కారు.

9. ప్రతి మసీదు నుండి ఒక ఇమాం/ ఒక మౌజాన్ మాత్రమే అర్హులు. ఒక మసీదులో ఇద్దరు లేదా అంతకంటే ఎక్కువ అర్హత ఉన్న పేష్ ఇమాం లేదా మౌజాన్ ఉంటె సినియరిటి ప్రకారం పేష్ ఇమాం తేడ మౌజా ఈ గౌరవ వేతనానికి అర్హులు

10. పేష్ ఇమాం మరియు మౌజాన్ పదవులకు అవసరమైన అన్ని అర్హతలు వారు కలిగి ఉండాలి.

## జాబితా లో లేని వారు దరఖాస్తు చేయు విధానం:

సంబందిత నిర్వాహకులు అనగా, ముతవల్లి , మేనేజ్మెంట్ కమిటీ వారు మసీదు యొక్క బ్యాంకు ఖాతా వివరములు మరియు పేష్ ఇమాములు మరియు మౌజాన్ల అబ్యార్దిత్వాన్ని ధ్రువికరించు పత్రములను తీసుకొని తమ గ్రామ/వార్డు సచివాలయలల్లో దరఖాస్తు చెసుకొనగలరు .

## విడాకులు పొందిన ముస్లిం మహిళలకు ఆర్థిక సహాయం

**అర్హతలు :**

1. భర్త చేత విడాకులు పొంది తిరిగి వివాహము చేసుకోకుండా ఉన్నవారు.
2. సివిల్ / ఫామిలీ కోర్ట్ నందు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర వక్ఫ్ బోర్డ్ విజయవాడ వారి మీద దావా డిక్రీ పొంది యుండవలెను.
3. వయస్సు 18 సంవత్సరాలు పై బడి ఉండవలెను
4. వారు ఈ క్రింది వాటిని కలిగి ఉండాలి
   a) ఆధార్ కార్డు
   b) చిరునామ రుజువు
   c) గృహ సరఫరా కార్డు
   d) ప్యాన్ కార్డు
   e) బ్యాంకు ఖాతా పుస్తకం

**దరఖాస్తు చేసుకోను విధానము**

పైన ఉదహరించిన అర్హతలు కలిగిన మహిళలు తమ సంబంధిత గ్రామ/ వార్డ్ సచివాలయా లలో నమోదు చేసు కొన గలరు

**హజ్ యాత్రకు వెళ్లే హాజీ లకు "ప్రయాణ ఖర్చు కాకుండా హజ్ తీర్థ యాత్ర ఇతర ఖర్చులకు" ప్రభుత్వం తరపు నుండి ఆర్థిక సహాయం" జెరూసలేం వెళ్లే క్రైస్తవులతో సమానంగా ఆర్థిక సహాయం కొత్త పథకం G.O.M.S No. 75, dt:19-11-2019 of M.W. Dept.**



- హజ్ యాత్రకు వెళ్లే వారి సంవత్సర ఆదాయం రూ.3.00 లక్షల వరకు ఉంటే వారికి రూ. 60,000/-
- సంవత్సర ఆదాయం రూ.3.00 లక్షల కంటే ఎక్కువ ఉన్న వారికి రూ.30,000/- ఇవ్వడం జరుగుతుంది.
- తహాశీల్దారు ధ్రువీకరించిన రాబడి ధ్రువ పత్రం తప్పక జతపరచాలి.
- ఆధార్ కార్డ్ / పాన్ కార్డ్ / ఓటరు ఐడీ వీటితో పాటు బ్యాంక్ పాస్ బుక్ మరియు పాస్ పోర్ట్ జిరాక్స్ , అభ్యర్థి యొక్క ఫోటో జతపరచవలెను.
- హజ్ యాత్రికులు సమర్పించిన పత్రాల ధృవీకరణ తరువాత వారి ఫ్లైట్ బయల్దేరే రిపోర్టింగ్ కు లోబడి యాత్రికుల బ్యాంక్ ఖాతాకు RTGS ద్వారా ఆర్థిక సహాయం విడుదల చేయబడుతుంది.
- ఈ ఆర్థిక సహాయం కేవలం జీవితంలో ఒక సారి మాత్రమే వర్తిస్తుంది.



# పవిత్ర జెరూసలెం కు యాత్ర



ఈ పథకం కింద, క్రైస్తవుల పవిత్ర స్థలమైన జెరూసలెం మరియు ఇతర పవిత్ర ప్రదేశములను సందర్శించుటకు ప్రభుత్వము 2019-20 సం|| నుండి రూ.3 లక్షలు లోపు ఆదాయం కలిగిన వారికి రూ.40,000/- నుండి రూ.60,000/- వరకు మరియు రూ.3 లక్షలు ఆదాయం దాటిన వారికి రూ.20,000/- నుండి రూ.30,000/- వరకు ఆర్థిక సహాయము పెంచినది. అదనపు మొత్తాన్ని లబ్ధిదారుడు భరించవలయును.

**యాత్రకు అయ్యే ఖర్చు మొత్తము** : Rs.1,05,500/-
**ఆర్థిక సహాయం** : రూ.3 లక్షలు లోపు ఆదాయం కలిగిన వారికి రూ.60,000/- ఆర్థిక సహాయము.
రూ.3 లక్షలు ఆదాయం దాటిన వారికి రూ.30,000/- ఆర్థిక సహాయము.

**యాత్ర సందర్శన రోజులు:** 10 పగళ్లు 9 రాత్రులకు.
**కనిష్ట బ్యాచ్ పరిమాణం** : 45 యాత్రికులు.
**సందర్శించు దేశములు :** జోర్డాన్, ఇజ్రాయెల్, పాలస్తీనియా మరియు ఈజిప్ట్.
**సందర్శించు పవిత్ర ప్రదేశములు :** బెత్లెహేమ్, సిలువ వేయబడిన ప్రదేశం జెరూసలేం, నజరేత్, జోర్డాన్ నది, మృత సముద్రము, గెలిలియా సముద్రము మరియు క్రైస్తవ విశ్వాసంతో అనుసంధానించబడిన ఇతర ప్రదేశాలు.

**ప్రక్రియ:**

- అభ్యర్థి ఆన్‌లైన్‌లో ఈ వెబ్సైట్ నందు దరఖాస్తు చేసుకొనవలయును www.christianminorities.ap.nic.in .
- అభ్యర్థుల ఎంపిక ప్రభుత్వం ఏర్పాటు చేసిన స్క్రీనింగ్ కమిటీ చేత చేయబడుతుంది.

# బ్యాంకు రుణం ఆధారిత స్వయం ఉపాధి సబ్సిడీ పథకాలు -
# ఆన్‌లైన్ లబ్దిదారు నిర్వహణ మరియు పర్యవేక్షణ వ్యవస్థ (OBMMS)

**9. బ్యాక్ ఎండ్ సబ్సిడీ విధానం ప్రకారం యూనిట్ల గ్రౌండింగ్ :**

ఎ. బ్యాక్ ఎండ్ సబ్సిడీ మార్గదర్శకాల ప్రకారం, బ్రాంచ్ మేనేజర్ సబ్సిడీ మొత్తాన్ని టర్మ్ డిపాజిట్ రసీదు (టిడిఆర్) లో రెండు సంవత్సరాల లాకింగ్ పీరియడ్ లో ఉంచుతారు.

బి. మంజూరు క్రమంలో సూచించిన మొత్తం యూనిట్ వ్యయాన్ని విడుదల చేయడం ద్వారా బ్రాంచ్ మేనేజర్ ఈ పథకాన్ని గ్రౌండ్ చేస్తారు.

సి. ఎంపిడిఓ, బ్రాంచ్ మేనేజర్, లబ్ధిదారుడు మరియు సంబంధిత కార్పొరేషన్ ప్రతినిధితో కూడిన గ్రౌండింగ్ కమిటీ ఈయూనిట్‌ను గ్రౌండ్ చేస్తుంది.

డి. బ్రాంచ్ మేనేజర్ యూనిట్ యొక్క ఫోటో ను యు.సి. తో పాటు పోర్టల్‌లో గ్రౌండింగ్ వివరాలను అప్‌లోడ్ చేయవలెను.

**10. యూనిట్ల జియో-ట్యాగింగ్:**

ప్రతి ఆరునెలల తరువాత, ఎంచుకున్న ఏజెన్సీ యూనిట్ యొక్క జియోట్యాగింగ్ ఫోటోను తీసుకుంటుంది మరియు పోర్టల్‌లో అప్‌లోడ్ చేయడానికి సంబంధిత ED కి సమర్పిస్తుంది.

**11. మూడవ పార్టీ ధృవీకరణ / యూనిట్ల ఆడిట్ :**

ఎంపిక చేయబడిన మూడవ పార్టీ ధృవీకరణ కూడా ఎంచుకున్న ఏజెన్సీ ద్వారా  చేయబడుతుంది. దీనిని రెండు దశల్లో, అనగా ప్రతి 6 నెలలకు మరియు 15వ నెల తరువాత పర్యవేక్షించి OBMMS పోర్టల్‌లో అప్‌లోడ్ చేయడానికి నిర్దేశిత ప్రొఫార్మాలోని ధృవీకరణ వివరాలను సంబంధిత ED కి సమర్పిస్తారు.

**12. బ్ధిదారు రుణ ఖాతాకు సబ్సిడీ సర్దుబాటు:**

ఎ. రెండేళ్లు పూర్తయిన తరువాత, గ్రౌండింగ్ కమిటీ మరోసారి భౌతికంగా యూనిట్ పర్యవేక్షించి ధృవీకరిస్తారు మరియు రికవరీ వివరాలను గమనించి, సబ్సిడీ మొత్తాన్ని లబ్ధిదారుడి రుణ ఖాతాకు సర్దుబాటు చేసేందుకు సంబంధిత ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ వారికి సమర్పిస్తారు. సంబంధిత ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ సంబంధిత బ్రాంచ్ మేనేజర్‌కు టిడిఆర్ ఉపసంహరణకు అనుమతి ఇస్తారు మరియు లబ్ధిదారుడి రుణ ఖాతాకు సబ్సిడీ ని సర్దుబాటు చేస్తారు.

బి. బ్యాక్ - ఎండ్ సబ్సిడీ మార్గదర్శకాల ప్రకారం, బ్రాంచ్ మేనేజర్ TDR పై వడ్డీ చెల్లించరు మరియు సబ్సిడీ మొత్తం పరిమాణంపై వడ్డీని వసూలు చేయరు.

# బ్యాంకు రుణం ఆధారిత స్వయం ఉపాధి సబ్సిడీ పథకాలు - ఆన్‌లైన్ లబ్ధిదారు నిర్వహణ మరియు పర్యవేక్షణ వ్యవస్థ (OBMMS)

**13. యుసిలు మరియు యూనిట్ ఫోటో అప్‌లోడ్:**

ED యూనిట్ల గ్రౌండిరగ్‌ను పర్యవేక్షిస్తారు మరియు సంబంధిత బ్యాంక్ మేనేజర్ పజ డ వీణ కి వినియోగ ధృవీకరణ పత్రాన్ని పంపుతారు.

**14.** మండల స్థాయిలో జెఎమ్ఎల్‌బిసి సమావేశాలలో, గ్రౌండ్ చేసిన యూనిట్ల స్థితి మరియు బ్యాంకులు తిరస్కరించిన యూనిట్లు మరియు కారణాలు సమీక్షించబడతాయి.

**15.** రవాణా పథకాలకు సంబంధించి, యూనిట్ల హైపోథెకేషన్ బ్యాంకులకు అనుకూలంగా జరుగుతుంది.

**16.** బ్యాంకు రుణ మొత్తాన్ని తిరిగి చెల్లించిన తరువాత ఫైనాన్సింగ్ బ్యాంక్ యూనిట్ యొక్క హైపోథెకేషన్‌ను విడుదల చేస్తారు.



# గ్రామ సచివాలయ
# సంక్షేమం మరియు విద్యా సహాయకుల
# శిక్షణ కరదీపిక

---

**SOCIAL WELFARE DEPARTMENT**

**GOVERNMENT OF ANDHRA PRADESH**

# భారత రాజ్యాంగం

## పీఠిక

భారతదేశ ప్రజలమగు మేము, భారతదేశమును సార్వభౌమ్య, సామ్యవాద,

లౌకిక, ప్రజాస్వామ్య, గణరాజ్యముగ నెలకొల్పుటకు మరియు అందలి

పౌరులెల్లరకు సామాజిక, ఆర్థిక, రాజకీయ, న్యాయమును,

భావము, భావప్రకటన, విశ్వాసము, ధర్మము, ఆరాధన -- వీటి స్వాతంత్ర్యమును,

అంతస్తులోను, అవకాశములోను సమానత్వమును, చేకూర్చుటకు;

మరియు వారందరిలో వ్యక్తి గౌరవమును, జాతీయ సమైక్యతను, అఖండతను

తప్పక ఒనగూర్చు సౌభ్రాతృత్వాన్ని, పెంపొందించుటకు,

సత్యనిష్ఠా పూర్వకముగ తీర్మానించుకొని,

ఈ 1949వ సంవత్సరము నవంబర్ 26వ దినమున

మా రాజ్యాంగ సభయందు ఇందుమూలముగ, ఈ రాజ్యాంగమును

అంగీకరించి, అధిశాసనము చేసి మాకు మేము ఇచ్చుకొన్నవారమైతిమి.

# బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

15. మత, జాతి, కుల, లింగ, జన్మస్థానం కారణంగా చూపే వివక్షత నిషేధం

1) మత, జాతి, కుల, లింగ, జన్మస్థానం కారణంగా రాజ్యం పౌరులపట్ల వివక్షతను చూపరాదు.

2) మత, జాతి, కుల, లింగ, జన్మస్థానం కారణంగా ఏ పౌరుడూ ఏ విధమైన అనర్హతలకు, బాధ్యతలకు, ప్రతిబంధకములకు గురి చేయబడరాదు.

ఎ) ప్రత్యేముగా ప్రజలందరూ ఉపయోగించే షాపులు, హోటళ్లు, విశ్రాంతి, వినోద గృహములు స్థలములు అనుభవించుటయందు;

బి) సర్వజనుల ఉపయోగార్థం అంకితమైన పాక్షికంగా కానీ, పూర్తిగా కానీ రాజ్య నిధులతో నిర్వహింపబడుతున్న బావులు, చెఱువు , స్నానఘట్టాలు, రహదారులు, విహారస్థలాలు వీటి అనుభవములో ఏ వ్యక్తిని అభ్యంతరపరచరాదు.

3) అయినప్పటికీ ఈ ఆర్టికల్‌లోని అంశములు ఏవీ స్త్రీలకు మరియు పసివారి సంక్షేమం కొరకు ప్రత్యేక రక్షణలను ఏర్పరుచుటయందు రాజ్యమునకు ఉన్న అధికారమునకు అడ్డురావు.

4) ఈ ఆర్టికల్‌లోని అంశములు ఏవీ మరియు ఆర్టికల్ 29 క్లాజ్ (2) లోని అంశములు; షెడ్యూల్ట్‌కులాల వారికి, షెడ్యూల్ట్ తెగలవారికి మరియు సాంఘికముగాను విద్యలోను వెనుకబడిన ఇతర తరగతుల వారికి ప్రత్యేక రక్షణలను ఏర్పరచుటయందు రాజ్యమునకు ఉన్న అధికారమునకు అడ్డురావు.

# బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

5) పైన ఉదహరించిన అంశములు ఏవీ షెడ్యూల్ కులముల వారికీ, షెడ్యూల్ తరగుతులవారికీ, మరియు వెనకబడిన తరగతుల వారికీ విద్యావకాశాలలో కల్పించు రక్షణలను ప్రైవేట్ విద్యా సంస్థలలో, అవి ప్రభుత్వంచేత సహాయమునకు పొందుచున్న లేక పొందినవైనా, ఏర్పరుచుటయందు రాజ్యమునకు ఉన్న అధికారమునకు అడ్డురాదు. అయితే, ఈ అధికారము అల్ప సంఖ్యాక వర్గాలు ఏర్పరచుకొను సంస్థలకు వర్తించదు.

16. ప్రభుత్వోద్యోగ వసతులతో సమానావకాశాలు

1) రాజ్యములోని అన్ని ప్రభుత్వోద్యోగములలోనూ, ప్రభుత్వోద్యోగవసతుల్లోనూ పౌరులందరికీ సమానావకాశములు ఉండవలెను.

2) మత, జాతి, కుల, లింగ, జన్మస్థానములలో అన్నింటిని గాని లేక ఏ ఒక్కటిని గాని కారణంగా, ఉద్దేశించి ప్రభుత్వోద్యేగార్హతలలోనూ, ప్రభుత్వోద్యోగములలోనూ చేర్చుకొనుటలోనూ పౌరులమధ్య వివక్షత చూపరాదు.

3) అయినప్పటికిని జన్మస్థానమును బట్టి రాష్ట్ర మరియు కేంద్రపాలిత, ప్రాంతముల ప్రభుత్వోద్యోగములలోని స్థానిక సంస్థలలోని మరియు స్వాధికార సంస్థలలోని ఉద్యోగములను స్థానికులకు కేటాయించు విధములో చట్టమును చేయు అధికారము పార్లమెంటుకు ఉన్నది. ఈ కేటాయింపు ఏదైనా ఒక తరగతికి లేక కొన్ని తరగతుల ఉద్యోగములకు పరిమితమయి వుండవలెను. ఈ కేటాయింపు ఉద్యోగుల నియామకం కంటే ముందు నిర్ణయించబడినవై ఉండవలెను.

4) అయినప్పటికీ, వెనుకబడిన తరగతులవారికి ప్రభుత్వోద్యోగములలోనూ, అవకాశములలోనూ ప్రత్యేక కేటాయింపులను ఏర్పరచు అధికారము రాజ్యమునకు ఉన్నది. వెనుకబడిన తరగతులవారు ప్రభుత్వోద్యోగములలో తగినంతమంది లేనట్లు రాజ్యము అభిప్రాయపడినపుడు మాత్రమే తదుచితమైన కేటాయింపులను చేయవచ్చును.

4ఎ) అయినప్పటీ, షెడ్యూల్డ్ తెగులు, షెడ్యూల్డ్ కులములకు చెందినవారికి ప్రభుత్వోద్యోగములలో పదోన్నతులయందు కూడా ప్రత్యేక కేటాయింపులను ఏర్పరచు అధికారము రాజ్యమునకు ఉన్నది. ఉన్నత పదవులలో వారికి సీనియారిట

## బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

ప్రసాదించు అధికారము కూడా రాజ్యమునకు ఉన్నది. షెడ్యూల్ తెగలు, షెడ్యూల్ కులములవారు తగినంతమంది ప్రభుత్వోద్యోగములలో లేనట్లు రాజ్యము అభిప్రాయపడినచో తదుచితమైన పదోన్నతులకు అనువైన కేటాయింపులను చేయవచ్చు.

17. అస్పృశ్యత నిషేధించడమైనది

ఇందు మూలముగా అస్పృశ్యత నిషేధింపబడినది. అస్పృశ్యత అనేది ఏ రూపములో ఉన్నా అన్ని స్వరూపములు నిషేధింపబడినవి. అస్పృశ్యత అను ఆచారము కింద అనుభవిస్తున్న అనర్హతలను ఎవరైనా అస్పృశ్యుల పట్ల అమలు చేసినచో అట్టి చర్య నేరముగా నిర్ధారింపబడి శిక్షార్హమగును.

23. మానవుల క్రయ విక్రయాల నిషేధం నిర్బంధకూలీ నిషేధం

1) సజీవులైన వ్యక్తులను వ్యాపార వస్తువులుగా మార్చి ఎవరూ వ్యాపారం చేయరాదు. బానిస వ్యాపారం బేగార్ మరియు తత్సంబంధిత వ్యాపారం నిషేధించబడినది. వీటితో వ్యాపారం చేయువారు శిక్షార్హులు. నిర్బంధ సేవ కూడా నిషేధింపబడినది. వ్యక్తులను నిర్బంధసేవకు గురిచేయువారు శిక్షార్హులు.

24. కర్మాగారాలలో పనివారి నియామకం, నిషేధం

1) 14 సంవత్సరముల వయస్సు నిండని పసివారిని కర్మాగారములలోనూ, భూగర్భముల యందు, ప్రమాదకరమైన పనులలోనూ నియమించరాదు.

29. అల్పసంఖ్యాకుల సంక్షేమ రక్షణ

1) ప్రత్యేకమైన భాషా, లిపి, సంస్కృతి కల ప్రజాసమూహములకు భారతదేశములో వారు ఎక్కడ నివసిస్తున్నా వారి భాషనూ, లిపినీ, సంస్కృతినీ పరిరక్షించుకునే హక్కు కలదు.

## బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

30. విద్యాసంస్థలను స్థాపించుట, నిర్వహించుట కొరకు అల్ప సంఖ్యాకులకు కల్పించిన రక్షణలు

1) అల్పసంఖ్యాకులందరికీ మతపరమైనవి అయినా లేక భాషాపరమైనవైనా, వారి సంక్షేమం కొరకు ప్రత్యేకమైన విద్యాసంస్థలను ఏర్పాటు చేసుకొని నిర్వహించుకొనే హక్కు ఉన్నది.

2) విద్యాసంస్థలకు రాజ్యం మంజూరు చేసే గ్రాంట్ ఇన్ ఎయిడ్‌ను అల్పసంఖ్యాకులు నిర్వహించే సంస్థలకు నిరాకరించరాదు.

38. ప్రజా సంక్షేమం, శ్రేయస్సుల నిమిత్తం సాంఘిక సంస్థలను స్థాపించుట

1) ప్రజా సంక్షేమం కొరకు రాజ్యం పాటుపడవలెను. ఈ ప్రక్రియలో రాజ్యం స్థాపంచే వ్యవస్థ, సంస్థలూ ప్రజలకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, న్యాయాన్ని, సమకూర్చే సాధనములుగా ఉండవలెను.

2) వ్యక్తుల మధ్య ఆదాయ, అసమానతను తగ్గించుట కొరకు హోదాలలోని అసమానతలను నిర్మూలించుటకు రాజ్యము ప్రత్యేక కృషి చేయవలెను. అదే విధముగా వేరు వేరు వృత్తులలో ఉన్న వారి మధ్య వేర్వేరు ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజల మధ్య ఆర్థిక పరిస్థితులలోనూ పని, ఉద్యోగావకాశాలలోనూ ఉన్న అసమానతలను నివారించే కృషిని చేయవలెను.

41. పనిని కలిగి ఉండే హక్కు చదువుకునే హక్కు, నిస్సహాయులకు ఆర్థిక సహాయం

1) శక్తి ఉన్నంతమేరకు రాజ్యము ప్రజలందరికీ పనిని కల్పించవలెను. విద్యావకాశములను కల్పించవలెను. ఉద్యోగం లేనివారికి, వయసు మీరినవారికి, అనారోగ్య బాధితులకు ఇతరత్రా శక్తిలేని నిస్సహాయులకూ ఆర్థిక సంహాయం అందించవలెను.

## బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

**45. పసివారి రక్షణ, ఉచిత మరియు నిర్బంధ చదువు**

6 సంవత్సరముల లోపలి పసివారందరికీ సంరక్షణనూ, చదువును అభ్యసించు అవకాశమును కల్పించుట కొరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు కృషి చేయవలెను.

**46. షెడ్యూల్డ్ తెగలకు, షెడ్యూల్డ్ కులాలవారికి ఇతర వెనకబడిన తరగతుల వారికి విద్యా ఆర్థికాభివృద్ధి కృషి**

షెడ్యూల్డ్ తెగలకు, షెడ్యూల్డ్ కులాల మరియు వెనకబడిన తరగతుల వారికి విద్యావకాశములు, ఆర్థిక మెరుగుబాటుకు ప్రత్యేక శ్రద్ధ చూపవలయును. వారిని సాంఘిక అన్యాయములు, దోపిడీల నుంచి రక్షించవలయును.

**244. షెడ్యూల్డ్ మరియు ట్రైబల్ ప్రాంతముల పరిపాలన**

1) అస్సాం, మేఘాలయ, త్రిపుర మరియు మిజోరామ్ రాష్ట్రాలు మినహా ఇతర రాష్ట్రాలలోని షెడ్యూల్ట్ మరియు ట్రైబల్ ప్రాంతముల పరిపాలన మరియు నియంత్రణకు 5వ షెడ్యూల్‌లోని అంశములన్నియూ వర్తించును.

**330. లోక్‌సభలో షెడ్యూల్డ్ కులాల వారికి, షెడ్యూల్డ్ తెగల వారికి స్థానాల కేటాయింపు**

1) లోక్‌సభలో సభ్యత్వములో ఈ క్రింద తరగతుల వారికి స్థానములను రిజర్వు చేయవలెను.

ఎ) షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ తెగలకు

2) షెడ్యూల్ట్ కులాలకు షెడ్యూల్డ్ తెగలకు రిజర్వు చేయు స్థానాములు ఆ రాష్ట్రము లేక యునియన్ టెరిటరీల శాసనసభ సభ్యులలో, ఆ రాష్ట్ర ప్రజల జన సంఖ్యయందు షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ తెగల జనసంఖ్యకు ఉండు నిష్పత్తిలో ఉండవలెను.

**332. శాసనసభలలో షెడ్యూల్డ్ కులాలవారికీ, షెడ్యూల్డ్ తెగలవారికీ స్థానాల కేటాయింపు**

1) అన్ని రాష్ట్ర శాసనసభల సభ్యత్వములలో షెడ్యూల్డ్ కులాల వారికి, షెడ్యూల్డ్ తెగల వారికి రిజర్వేషన్ ఉండవలెను.

## బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

334. పై కేటాయింపులు 70 సంవత్సరముల అనంతరం కొనసాగరాదు

ఈ పార్ట్‌లో ఇంతకుముందు ఏ విధముగా ఉన్నా ....

ఎ) షెడ్యూల్డ్ కులాలవారికీ, షెడ్యూల్డ్ తెగలకూ పార్లమెంట్‌లోనూ, రాష్ట్ర శాసనసభలలోనూ కల్పించిన రిజర్వేషన్లు.

బి) ఆంగ్లో ఇండియన్‌లకు లోక్‌సభలోనూ, రాష్ట్ర శాసనసభలలోనూ నామ నిర్దేశము ద్వారా కల్పించిన ప్రాతినిధ్యమునకు ఈ సంవిధానం అమలుకు వచ్చినప్పటి తేదీ నుంచి డెబ్బది సంవత్సరముల అనంతరం అంతమగును.

335. షెడ్యూల్డ్ కులాలవారికీ, షెడ్యూల్డ్ తెగల వారికీ ప్రభుత్వోద్యోగాలలో హక్కుల గుర్తింపు

యూనియన్ మరియు రాష్ట్ర ప్రభుత్వ సేవలలో సిబ్బందిని నియమించునపుడు షెడ్యూల్డ్ కులముల, షెడ్యూల్డ్ తెగల కొరకు గుర్తింపబడిన హక్కులను విధి పరిగణలోకి తీసుకొనవలెను. ఈ సూత్రముల అమలు పరిపాలనా దక్షతకు అనుగుణంగా ఉండవలెను. అయినప్పటికీ, ఏ తరగతికి చెందిన ఉద్యోగాలలోనైనా పదోన్నతి కొరకు జరుగు పరీక్షలలో మరియు ఇతర అర్హతలను నిర్ధారించుటయందు షెడ్యూల్డ్ తరగతుల వారికి, షెడ్యూల్డ్ కులములవారికి కనీస మార్కులు, నిర్దిష్ట ప్రమాణములయందు సడలింపుల నిచ్చుటకు ఈ ఆర్టికల్ అడ్డురాదు.

338. నేషనల్ కమిషన్ ఫర్ షెడ్యూల్డ్ కాస్ట్స్

1) నేషనల్ కమిషన్ ఫర్ షెడ్యూల్డ్ కాస్ట్స్ అను పేరుతో ఒక సంస్థ ఉండవలెను.

338.ఎ. నేషనల్ కమీషన్ ఫర్ షెడ్యూల్డ్ ట్రైబ్స్

1) నేషనల్ కమీషన్ ఫర్ షెడ్యూల్డ్ ట్రైబ్స్ అను పేరుతో ఒక సంస్థ ఉండవలెను.

2) ఈ క్రింది ఉదహరించిన అంశములుపై కమిషన్‌లు నిర్వహించు విధులు:

## బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

ఎ) షెడ్యూల్డ్ కులములకు/షెడ్యూల్డ్ తెగలకు సంవిధానం క్రింద మరియు ఏదైనా ఇతర చట్టములు లేక నిర్దేశాలను అనుసరించి కల్పించిన రక్షణలపై దర్యాప్తును జరుపుట. ఆ రక్షణల అమలు జరుపుటను పర్యవేక్షించుట మరియు వాటి పరిణామాలను ఎంచుట.

బి) షెడ్యూల్డ్ కులముల/షెడ్యూల్డ్ తెగల కొరకు ఏర్పరచిన రక్షణల నిమిత్తమై అందు నిర్దష్టమైన ఫిర్యాదులపై విచారణ జరుపుట.

సి) యూనియన్ మరియు రాష్ట్రములలో షెడ్యూల్డ్ కులముల/షెడ్యూల్డ్ తెగల ఆర్థిక, సాంఘిక సంక్షేమాల కొరకు జరుగు ప్రణాళికా విధానాల చర్చలలో పాల్గొనుట మరియు సలహాలను అందించుట మరియు యూనియన్, రాష్ట్రములలో అమలు అవుతున్న ప్రణాళికల పరిణామాలను ఎంచుట.

డి) పైన ఉదహరించిన రక్షణలపై ప్రతి సంవత్సరం మరియు కమిషన్ ఎపుడు అవసరమని తలిస్తే అపుడు రాష్ట్రపతికి నివేదికలను సమర్పించుట.

ఇ) ఆ నివేదికలలో యూనియన్ మరియు రాష్ట్ర ప్రభుత్వములు పైన ఉదహరించిన రక్షణ అమలు కొరకు చేపట్టవలసిన ప్రభాన్విత చర్యల గురించిన సిఫార్సులు ఉండవచ్చును.

ఎఫ్) షెడ్యూల్డ్ కులములకు/ షెడ్యూల్డ్ తెగలకు కల్పించిన ప్రత్యేక హక్కుల రక్షణ, వారి సంక్షేమం, సాంఘికాభివృద్ధి పురోగతికి సంబంధించి రాష్ట్రపతి అందించు అన్ని ఇతర ఆదేశాలను నిర్వహించుట.

3. యూనియన్ ప్రభుత్వం మరియు రాష్ట్ర ప్రభుత్వములు షెడ్యూల్డ్ కులముల/ షెడ్యూల్డ్ తెగల కొరకు రూపొందించు విధానాలన్నింటిపైనా కమిషన్‌ను సంప్రదించవలెను.

## బలహీన వర్గాల వారి సంక్షేమానికి, హక్కుల పరిరక్షణకు రాజ్యాంగంలోని ఆర్టికల్స్

### 340. వెనుకబడిన తరగతుల స్థితిగతులను విచారించే నిమిత్తం కమీషన్ నియామకం

ఈ దేశములో సాంఘికంగాను, విద్యలోను వెనుకబడిన తరగతులవారి స్థితిగుతులపైన వారు అనుభవించుచున్న ఇక్కట్లపైన విచారణ జరిపే నిమిత్తం, వెనుకబడిన తరగతుల సంక్షేమం కొరకూ వారి ఇబ్బందులను తొలగించేందుకు యూనియన్ మరియు రాష్ట్రములు చేపట్టవలసిన చర్యలను సూచించే నిమిత్తం మరియు యూనియన్, రాష్ట్ర ప్రభుత్వములు వెనుకబడిన తరగుతుల వారి పురోగతిని, అందించవలసిన గ్రాంట్లను, వాటి మంజూరుకు అవసరమయిన షరతులను సూచించే నిమిత్తం, రాష్ట్రపతి తనకు సమర్థులను నమ్మకం ఉన్న వ్యక్తులను కమీషన్‌గా నియమించవలెను. ఆ నియామక ఉత్తర్వులో కమీషన్ అనుసరించవలసిన కార్యక్రమ నియమావళిని నిర్ణయించవచ్చు.

### 350. ఇబ్బందుల నివారణకై సమర్పించు అర్జీల భాషలు

ప్రతివ్యక్తి ఏదైనా ఇబ్బంది నివారణ నిమిత్తం యూనియన్ ప్రభుత్వమునకు లేక యూనియన్ ప్రభుత్వాధికారులకు మరియు రాష్ట్ర ప్రభుత్వములకు లేక రాష్ట్ర ప్రభుత్వాధికారులకు సమర్పించు అర్జీని ఏ దేశ భాషలోనై , సమర్పించుకొనే హక్కు ఉన్నది.

# సంక్షేమం మరియు విద్యా సహాయకుని జాబ్ చార్ట్

(G.O.Ms. No. 107 (SW) Dept., Dt. 25-9-2019)

ఎ). సంక్షేమం మరియు విద్యా సహాయకుని విధుల జాబితా (జాబ్ చార్ట్):

సాధారణ విధులు:

1. సాంఘిక సంక్షేమ, బి.సి.సంక్షేమ, గిరిజన సంక్షేమ, మైనారిటీ సంక్షేమ, విభిన్న ప్రతిభావంతుల మరియు ఇతర సంక్షేమ శాఖలచే బలహీన వర్గాల వారికి అమలు చేయబడే కార్యక్రమాల గురించి వారి పరిధిలోని గ్రామాలలోని ప్రజలకు అవగాహన కల్పించుట.
2. సంక్షేమ శాఖల ద్వారా అమలు చేయబడే పథకాలకు అర్హులైన లబ్ధిదారుల గుర్తింపు.
3. సదరు సంక్షేమ పథకాల అర్హులైన అందరికి లభ్యమయ్యేటట్లు వారికి అన్ని విధాల సహాకరించడం, వీలు కల్పించడము.
4. సదరు సంక్షేమ పథకాల అమలు తీరుపై ఉన్నతాధికారులకు ఫీడ్‌బ్యాక్ కల్పించుట.
5. గ్రామ సచివాలయ పరిధిలో సంక్షేమ పథకాలకు సంబంధించి గ్రామ వాలెంటీర్ల పనితీరు తనిఖీ మరియు పర్యవేక్షణ చేయడం.

ప్రత్యేక విధులు:

1. గ్రామాలలోని స్కూల్, కాలేజ్‌లకు వెళ్ళే అర్హులైన పిల్లలు సంక్షేమ హాస్టళ్ళు, సంక్షేమ విద్యాలయాలు, ఇతర విద్యాసంస్థలలో చేరేందుకు, అట్టి వారి చదువు పూర్తి అగువరకు స్కూల్/కళాశాల లోనే కొనసాగునట్లు, కనీసం ఇంటర్మీడియట్ వరకు అయినా చదువు పూర్తి అగునట్లు కృషిచేయుట.
2. వారి గ్రామ పరిధిలోని బీద/బలహీన వర్గాల వారి అర్హులైన పిల్లలందరికి ఉపకార వేతనములు మరియు ఇతర విద్యాభివృద్ధి గ్రాంట్లు, ప్రభుత్వం వారు ఇచ్చు సబ్సిడీలు, వస్తువులు వంటివి అందునట్లు చూచుట.
3. గ్రామంలోని మానవ హక్కుల పరిరక్షణ, సాంఘిక సామరస్యత పెంపొందించుట, గ్రామంలో బలహీన వర్గాల ప్రజలపై ఎట్టి సాంఘిక వివక్షత లేకుండా చూడటం, మరియు సాంఘిక వివక్షత/దురాచారం గుర్తించినట్లు అయితే గ్రామ పంచాయితీ సెక్రెటరీకి మరియు ఉన్నతాధికారులకు తెలియచేయడం.

# సంక్షేమం మరియు విద్యా సహాయకుని జాబ్ చార్ట్

(G.O.Ms. No. 107 (SW) Dept., Dt. 25-9-2019)

4. విద్యా సంస్థల ప్రధానాచార్యులతో సమన్వయంతో వ్యవహరించి తరచుగా విద్యాసంస్థలకు గైర్హాజరు అయ్యే మరియు తక్కువ అభ్యసన స్థాయి కల్గిన విద్యార్థుల అభ్యసన స్థాయి పెంచుటకు, సక్రమంగా పాఠశాలకు వెళ్లుటకు అట్టి విద్యార్థుల తల్లిదండ్రులకు ప్రోత్సహించి ప్రేరణ కల్పించుట, ఒకవేళ సచివాలయ పరిధి బయట అటువంటి విద్యార్థుల తల్లిదండ్రులు నివసిస్తున్నట్లయితే, ఆ వివరాలను సంబంధిత గ్రామ పంచాయితీ సెక్రటరీలకు బదిలీ చేయడం.
5. నిరుద్యోగులైన బలహీన వర్గాల వారి పిల్లలు ప్రస్తుతము అమలులో ఉన్న ప్రభుత్వ పథకాల ద్వారా లబ్ధిపొందే విధంగా చూడటం.
6. స్వయం ఉపాధి పథకాలు స్థాపించగోరు అర్హులైన బలహీన వర్గాల వార్కి ఆర్థిక సహాయం అందించుటకు బ్యాంకు వారితో సమన్వయంగా వ్యవహరించడం.
7. సంక్షేమ శాఖలచే అమలు చేయబడు వివిధ సంక్షేమ పథకాలు. (జగనన్న విద్యానిధి, YSR కళ్యాణ కానుక, విదేశీ విద్యా పథకము, BAS (ఉన్నత ప్రమాణాల స్కూళ్లు), ఇంటర్ విద్యార్థులకు కార్పోరేట్ విద్య, విద్యోన్నతి, డప్పు కళాకారుల పెన్షన్, చెప్పులు కుట్టు వృత్తి వారి పించన్లు), మొదలగునవి అర్హులైన వారు పొందుటకు సహకరించడం.

# సంక్షేమం మరియు విద్యా సహాయకుని జాబ్ చార్ట్

(G.O.Ms. No. 107 (SW) Dept., Dt. 25-9-2019)

బి. గ్రామీణ పేదరిక నిర్మూలన సంస్థ కార్యక్రమాలపై జాబ్ చార్టు:

1. పింఛన్లు:

1. గ్రామంలోని వారికి, ప్రతి నెల పించన్ల పంపిణీని పర్యవేక్షించుట.
2. ప్రతి నెల డబ్బు డ్రా చేసి గ్రామసహాయకులకు ఇచ్చుట.
3. వినియోగింపబడని పెన్షన్ మొత్తమును గ్రామ వాలంటీర్ల నుండి సేకరించి పెన్షన్ ఖాతాకు జమచేయుట.
4. పింఛనదారులలో మరణించిన వారి వివరాలు సేకరించి, సంబంధిత వెబ్‌సైట్‌లో "డిజిటల్ అసిస్టెంట్" ద్వారా నమోదు చేయుట.
5. గ్రామ వాలంటీర్ల ద్వారా నూతన పించను దరఖాస్తులను, పింఛనుదారులను పరిశీలించడం.
6. పెన్షన్‌కు క్రొత్తగా అర్హులైన వారిని గుర్తించడం, అట్టివారు దరఖాస్తు చేసుకోవడానికి సహకరించడం.
7. మండల అభివృద్ధి అధికారికి నెలవారీ రిపోర్టు పంపుట.
8. గ్రామస్థాయిలో పింఛనుదారుల సమస్యలను పరిష్కరించడం.

II. సంస్థాగత ఏర్పాట్లు (**IB**):

1. స్వయం సహాయక సంఘాలలో లేకుండా మిగిలిపోయిన పేద మహిళలను గుర్తించడం, VOA (విలేజ్ ఆర్గనైజేషన్ అసిస్టెంట్)తో సమన్వయం చేసుకుంటూ ప్రస్తుతమున్న స్వయం సహాయక బృందం (SGH)లో చేర్చడం గానీ, లేదా క్రొత్త స్వయం సహాయక బృందంగా ఏర్పాటు చేయడం.
2. VOA (విలేజ్ ఆర్గనైజేషన్ అసిస్టెంట్)తో సహా స్వయం సహాయ గ్రూప్ (SHG)/VO సమావేశములకు హాజరవడం.
3. SHG)/VO సమావేశాలలో అన్ని ప్రభుత్వ సంక్షేమ పథకాలపై అవగాహన కల్పించడం.

# సంక్షేమం మరియు విద్యా సహాయకుని జాబ్ చార్ట్

(G.O.Ms. No. 107 (SW) Dept., Dt. 25-9-2019)

4. గృహ మంజూరు, పింఛన్లు, బోర్లు వంటి ప్రభుత్వ పథకాల లబ్ధికి అర్హులైన వారిని గుర్తించడం, SHG)/VO సమావేశాలలో అట్టి వారిని గుర్తించి తీర్మానం చేయడం, వారికి తగు మంజూరుకు సంబంధిత సంక్షేమ శాఖలతో సమన్వయంగా వ్యవహరించడం.

**III. స్వయం సంహాయక బృందాల జీవనోపాధుల అభివృద్ధి:**

1. **వై.ఎస్.ఆర్ (YSR) ఆసరా పథకము:** వై.ఎస్.ఆర్ (YSR) ఆసరా పథకముపై అవగాహన కల్గించడం, మరియు అర్హత కల్గిన స్వయం సహాయక బృందానికి గౌరవ ముఖ్యమంత్రి గారి లేఖతో కూడిన ధృవపత్రంతో సహా లబ్దిదారులకు అందించడం.
2. **వై.ఎస్.ఆర్ VLR** పథకము:
    1. స్వయం సహాయక బృందంలోని మహిళలు వై.ఎస్.ఆర్ వడ్డీ లేని ఋణాలకు 100% ఆర్థిక సహాయం పొందుటకు అర్హత విధి విధానాలపై అవగాహన కల్పించడం.
    2. వై.ఎస్.ఆర్ వడ్డీ లేని ఋణాలకు అర్హత పొందేందుకు స్వయం సహాయక బృందాలు బ్యాంకులకు రుణ వాయిదాలను సకాలంలో చెల్లించవలెనని అవగాహన కల్పించడం. గౌరవ ముఖ్యమంత్రి లేఖతో కూడిన ధృవ పత్రము పంపిణీ కార్యక్రమానికి సమన్వయంతో వ్యవహరించడం.

3. స్త్రీ నిధి పథకము:

1. స్త్రీ నిధి జీవనోపాధి ఋణ పథకంపై గ్రామ సభ సమావేశము నందు అవగాహన కల్పించడం.
2. గ్రామ సంఘంలో 100% క్రెడిట్ లిమిట్ సాధనకు కృషిచేయడం.
3. స్త్రీ నిధి డిపాజిట్లు పథకాల గురించి స్వయం సహాయక బృందాలకు అవగాహన కల్పించడం.
4. వై.ఎస్.ఆర్ వడ్డీ లేని ఋణాల పథకము ద్వారా స్త్రీ నిధి జీవనోపాధి ఋణ సహాయ పంపిణీ తదుపరి సద పథకం నియమ నిబంధనలు ఋణ గ్రహీతలు తప్పకుండా అనుసరించునట్లు చూడటం.

4. వై.ఎస్.ఆర్ భీమా:

1. గ్రామ పంచాయితీ లోని గ్రామ వాలెంటీర్ల ద్వారా వ్యవస్థీకృతం కాని అందరు కూలీల నమోదుకు అవగాహన కల్పించడం.
2. వ్యవస్థీకృతం కాని కూలీలను గ్రామ వాలెంటీర్ల ద్వారా నమోదు చేయడం. 3. వెబ్‌సైట్ ద్వారా వివరాలు నమోదు.
4. వ్యక్తిగత పాలసీ బాండ్లు/గుర్తింపు కార్డుల పంపిణీ. 5. మరణం తదుపరి గంటలో సమాచారము కాల్ సెంటర్‌కు ఇవ్వడం.
6. చనిపోయిన పాలసీదారుల క్లెయిములు గ్రామ వాలెంటీర్ల ద్వారా తెప్పించడం.
7. పాలసీదారుల పిల్లల స్టడీ సర్టిఫికెట్ మరియు వివరములు సేకరణ జరుగునట్లు చేయుట.
8. గ్రామ వాలెంటీర్ల ద్వారా ఉపకార వేతనముల పంపిణీ జరుగునట్లు చూచుట.

# సంక్షేమం మరియు విద్యా సహాయకుని జాబ్ చార్ట్

(G.O.Ms. No. 107 (SW) Dept., Dt. 25-9-2019)

**సి. విద్యా శాఖ కార్యక్రమాలపై జాబ్ చార్టు:**

1. 5–15 సంవత్సరముల వయస్సు గ్రూపులో పాఠశాల వదలివేసిన వారు/అసలు పాఠశాలలో నమోదు కాని పిల్లలను గుర్తించడం. వారిలో వయస్సుకు అనుగుణంగా విద్యా ప్రవంతిలోనికి తెచ్చుటకు దగ్గరలో ఉన్న ప్రత్యేక రెసిడెన్షియల్ శిక్షణా కేంద్రాలు (RSTC),
2. ప్రత్యేక నాన్ రెసిడెన్షియల్ శిక్షణా కేంద్రాలలో (NRSTC) కాని చేరుటకు గల అవకాశాలపై అవగాహన కల్పించడం. అవసరమైతే వాటిలో చేర్పించుటకు కృషి చేయుట.
3. NRSTC/RSTC లు సందర్శించి విద్యా విషయక మార్గదర్శకాలు ఇవ్వడం.
4. పాఠశాల మేనేజ్‌మెంటు కమిటీ/ఉపాధ్యాయ-తల్లిదండ్రుల సమావేశానికి హాజరు కావడం.
5. విద్యార్థుల విద్య ఫలితాల గురించి (అభ్యసన సామర్థ్యం గురించి) తల్లిదండ్రులకు సమాచారము అందించడం.
6. తక్కువ అభ్యసన స్థాయి గల విద్యార్థుల వివరాలు తరగతి ప్రధానోపాధ్యాయుడు/తరగతి ఉపాధ్యాయుడు నుండి సేకరించి ప్రత్యామ్నాయ బోధన కల్పించడంలో ప్రధాన పాత్ర పోషించడం.
7. గ్రామాలలో పదవ తరగతి (ఎస్.ఎస్.సి) ఉత్తీర్ణత కాని విద్యార్థులను గుర్తించి, వారు ఉత్తీర్ణత చెందుటకు మామూలు పద్ధతి ద్వారా లేదా అవసరం అయినచో AP ఓపెన్ స్కూల్ (APOS) ద్వారా అట్టివారు SSC లో అర్హత సాధించుటకు మార్గదర్శకత్వం ఇవ్వడం.
8. ఎస్.ఎస్.సి. పూర్తి చేయుటకు అనాసక్తి చూపించువారికి స్కిల్ డెవలప్మెంట్ (నైపుణ్యాభివృద్ధి) కోర్సుల గురించి మార్గదర్శకం ఇవ్వడం.

9. అంగన్వాడీ కేంద్రాలలోని 5 సంవత్సరాలు నిండిన పిల్లలు ప్రాథమిక పాఠశాలలో 1వ తరగతిలో 100% నమోదుకు సహకరించడం.
10. స్కూలు విద్యావ్యవస్థలో గృహ పంపిణీ లేనందున ప్రభుత్వంచే మంజూరు అయ్యే పథకాలు అయిన నోట్‌బుక్స్, యూనిఫాంలు, మధ్యాహ్న భోజన వసతి, శానిటరీ న్యాప్కిన్లు మరియు సైకిళ్ళు మొదలైనవి అర్హులకు చేరుటకు కృషిచేయుట.
11. అమ్మ ఒడి పథకంలో తల్లుల ఎంపికలో ప్రధాన పాత్ర పోషించడము.

**డి. గృహ నిర్మాణ శాఖ కార్యక్రమాల పై జాబ్ చార్టు:**

1. గృహ మంజూరుకు అర్హత గల కుటుంబాల సర్వే మరియు వారి డాక్యుమెంటేషన్.
2. పథకము నిబంధనల మేరకు అర్హత గల లబ్ధిదారుల ఎంపిక.
3. మంజూరు అయిన లబ్ధిదారులతో PRA నిర్వహణ.
4. గృహ లబ్ధిదారులను గృహ నిర్మాణం చేయుటకు ప్రోత్సహించుట.
5. ఇంటితో పాటు వ్యక్తిగత మరుగుదొడ్లు నిర్మించుటకు లబ్ధిదారులను ప్రోత్సహించుట.
6. బ్యాంకు ఖాతా తెరుచుటకు గృహ లబ్ధిదారులకు చేయూతనివ్వడం.
7. గృహ నిర్మాణాల స్థితిపై నివేదికను తదుపరి చర్యలకు వార్డు సెక్రటేరియట్‌కు సమర్పించుట.
8. గృహ లబ్ధిదారుల గుర్తింపు, ఎంపిక మంజూరులపై ఫిర్యాదులు పరిష్కరించడం మరియు గృహ నిర్మాణంలో ఇతర ప్రభుత్వ పథకాల అనుసంధానం పై సమన్వయ కర్తగా వ్యవహరించడం.

**గమనిక:** సంబంధిత అధికారులు తనకు కేటాయించిన ఏ ఇతర అధికార పని అయినను, తమ శాఖకు సంబంధించక పోయినను, సంక్షేమ మరియు విద్యా సహాయకులు నిర్వహించవలెను.

–సాంఘిక సంక్షేమ శాఖ

## ఎస్.ఆర్.శంకరన్... ఒక ఆదర్శ అధికారి – (22.10.1934-7.10.2010)



తమిళనాడులోని తంజావూరు జిల్లా సిరిగలత్తురు గ్రామంలో 22.10.1934లో శంకరన్ గారు జన్మించారు. వీరిది ఒక మధ్య తరగతికి చెందిన బ్రహ్మణ కుటుంబం. అయితే వీరు కుల, మత, భాష, ప్రాంతీయపరమైన అన్ని అడ్డుగోడలను ఛేదించి ఒక అభ్యుదయవాదిగా, పేదల పెన్నిధిగా నిలిచారు.మద్రాసు లయోల కళాశాలలో విద్యాభా సం పూర్తిచేసి అతిపిన్నవయసులో (23 సంవత్సరాలకే) కేంద్రప్రభుత్వ ఐ.ఎ.యస్. సర్వీసుకు ఎంపికై ఆంధ్రప్రదేశ్ కాడర్‌కు కేటాయించబడ్డారు.

1957 లో ఐ.ఎ.యస్. లో విధుల్లో చేరినప్పటి నుంచి 1992 లో పదవి విరమణ చేసేవరకు ఎన్నో పదవులు నిర్వహించారు.

ఏ పదవిలో వున్నా ఆయన నిరుపేదల పక్షాన నిలబడి ఆఖరుకి కొన్ని సమయాలలో ప్రభుత్వంతో రాజీపడలేక దీర్ఘకాలిక సెలవుపై వెళ్ళి ఆ తర్వాత త్రిపుర రాష్ట్రానికి చీఫ్ సెక్రటరిగా వెళ్ళటం జరిగింది. శంకరన్ గారిది ఏరకమైన భేషజాలకి లోనుకాని వ్యక్తిత్వం ఉద్యోగధర్మంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా తట్టుకొని ఎవరికి వత్తాసు పలకకుండా నిరుపేదల పక్షాన నిలబడి పోరాడిన యోధుడు. రాజ్యాంగంలోని 309, 310, 311, 312 అధికరణలు అధికార యంత్రాంగానికి రక్షణ కల్పించినందున రాజ్యాంగ లక్ష్యాలను సాధించడంలో ఉన్నతాధికారులు ఎవరి ఒత్తిడికి లొంగరాదన్నది ఆయన ప్రగాఢ విశ్వాసం, ఆ మేరకే జీవితమంతా పేదల పక్షాన పోరాడి అంబేద్కర్ మనకు ప్రసాదించిన రాజ్యాంగాన్ని స్ఫూర్తిగా చేసుకుని పేదలకు మరిన్ని సేవలు అధికారాలు అందించాలన్నది వారి భావన. రాజకీయ నాయకుల ఒత్తిళ్ళకు లొంగకుండా, స్వేచ్ఛగా ఇంకా చెప్పాలంటే రాజకీయ నాయకులకు వారి విధులను నిర్దేశిస్తూ, వారిని నియంత్రిస్తూ అధికార యంత్రాంగం సాగిపోవచ్చును. అయితే తాత్కాలికమైన భయాలు, ప్రలోభాలు అధికారులను తమ పనులను తాము చేసుకోనియ్యకుండా చేస్తాయి. వాటిని ఎలా అధిగమించాలో శంకరన్ గారు నిరూపించారు.

## ఎస్.ఆర్.శంకరన్... ఒక ఆదర్శ అధికారి – (22.10.1934-7.10.2010)

శంకరన్ గారు అంచెలంచలుగా ఎన్నో పదవుల్ని చేపట్టారు. కర్నూలు జిల్లా, నంద్యాల సబ్ కలెక్టరుగా, ఆ తర్వాత నెల్లూరు జిల్లా జాయింట్ కలెక్టరుగా 3 సంవత్సరాలు, నెల్లూరు జిల్లా కలెక్టరుగా 3 సంవత్సరాలుగా పనిచేసిన కాలంలో నెలకు సగం రోజులు క్షేత్ర పర్యటనలు చేపట్టి ప్రజల్లో, ముఖ్యంగా నిరుపేదలకు సంక్షేమ కార్యక్రమాలు వాటి ఫలాలు అందేలా కృషిచేసేవారు. ఎక్కడ ఏ మంచి పని జరిగినా వాటిని చూసి అధికారులను అభినందించి వారికి ఉత్తేజాన్ని కలుగజేసేవారు. ఆ క్రమంలోనే గుర్తెడు సంఘటన సంభవించింది.

1987లో గుర్తెడు సంఘటన ఆంధ్రప్రదేశ్‌లో (ఉమ్మడి ఆంధ్రప్రదేశ్) ఒక సంచలనం. అధికారు చేసిన అభివృద్ధి కార్యక్రమాలు చూడటానికి తూర్పుగోదావరి జిల్లాలో మారుమూల కుగ్రామమైన గుర్తెడుకు అధికారులతో బయలుదేరిన శంకరన్ బృందాన్ని సాయుధ నక్సలైట్లు చేశారు. ఆ సంఘటనలో ఎవరు చనిపోకుండా అందరినీ క్షేమంగా నక్సలైట్లు విడుదలచెయ్యటం కేవలం శంకరన్ గారి వల్లే సాధ్యమైంది.

ఆయన జీవనశైలి అతి నిరాడంబరంగా వుండేది. ఆయన వాడే ప్రతి వస్తువు ఆయన నిరాడంబర జీవన శైలి తెలియజేస్తుంది. శంకరన్ గారికి భార్యాపిల్లలు కుటుంబం ఏదిలేదు. ఆయన ఆజన్మబ్రహ్మచారి. పెళ్ళి తను ఎంచుకున్న మార్గానికి అవరోధమని భావించారాయన. కాని ఆయనకు నిరుపేదలు, దళితులు గిరిజనులందరు ఆయన కుటుంబమే. ఆయన ఎంత ఉన్నత పదువులు నిర్వహించినా, ఆయన నివసించింది సింగిల్ బెడ్ రూంలోనే. ఆయనకున్న ఆస్తులు ఆ బెడ్ రూంలో వున్న పుస్తకాలు, ఆయన ధరించే మామూలు ఫాంటు, అరచొక్కా -నిలువెత్తు నిరాడంబరత్వానికి నిదర్శనం. ఆయన ప్రక్కన బిళ్ళ బంట్రోతు లేకపోతె కలెక్టరుగారు అని తెలుసుకోవటం కష్టమయ్యేదట. అందుకే అందరూ ఆయన్ని ఐ.ఎ.యస్ గాంధి అని పిలిచేవారు. నెల్లూరు కలెక్టరుగా వున్నప్పుడు విశాలమైన తన కలెక్టరు బంగళాను ప్రవేటు బిల్డింగ్‌లో జరుపుకుంటున్న విద్యార్ధినులకు చదువుకోడానికి ఇచ్చేశారు.

## ఎస్.ఆర్.శంకరన్... ఒక ఆదర్శ అధికారి – (22.10.1934-7.10.2010)

శంకరన్ గారు నిర్వహించిన శాఖలో ఆయనకు అత్యంత ఇష్టమైనశాఖ సాంఘిక సంక్షేమశాఖ, ఎందుకంటే ఆ శాఖ ద్వారానే ఎక్కువగా గిరిజనులు, షెడ్యూలు కులాల వారికి సేవచేసే భాగ్యం కలుగుతుంది. శంకరన్‌గారి దృష్టిలో "ఎస్సీ, ఎస్టీల అభివృద్ధి అనేది వారి సామాజిక అర్థిక స్థితిగతుల్లో ఏదో కొంచెం మార్పు వేగవంతంగా రావాలి. మిగతా సమాజానికి, వారికి మధ్యనున్న అంతరాలు అగాధాలు సాధ్యమైనంత త్వరగా పడిపోయి చివరకు పూర్తిగా నిర్మూలించబడాలి. న్యాయబద్ధమైన మానవత్వంతో తొణికిసలాడే సమసమాజం ఏర్పడేందుకు దోహదపడాలి"

వీరి హయాంలోనే గిరిజనులకు ముఖ్యంగా గిరిజన ప్రాంతాల్లో వసతిగృహాలు, స్కాలర్స్ కిచ్చే డబ్బు పెంచడం జరిగింది. గిరిజనుల ఆర్థిక పరిస్థితులు సామాజిక స్థితిగతులు తెలుసుకొని వాటికి అనుగుణంగా ప్రణాళికలు రూపొందించేవారు, వెట్టిచాకి , జోగిని వ్యవస్థల నిర్మూలన, చెంచు యానాదుల కోసం ఆయన చేసిన సేవలు అనిర్వచనీయం. ఎస్.సి, ఎస్.టి జనాభా దామాషా పద్ధతిలో బడ్జెట్ కేటాయింపులు చేయటం, ఉపప్రణాళికలు తయారు చేయటం వీరి కాలంలోనే అంకురార్పణ జరిగింది..

పేదరిక నిర్మూలనలో వారికి తలపెట్టిన కార్యక్రమాల్లో భూసంస్కరణలు ప్రధాన పాత్ర వహిస్తాయని నమ్మినవాడు శంకరన్. భూమి సమస్యే, పేదరికానికి, దోపిడికి, దుఃఖానికి, అవమాన మానవ సంబంధాలకు ప్రధాన కారణమని గ్రహించారు, దళిత గిరిజనులకు భూమి బదలాయింపు ద్వారా, ఆర్థికంగా, సాంఘికంగా సమాజంలో హోదా లభిస్తుందని నమ్మిన వ్యక్తి.

1980లో దేశానికే ఆదర్శవంతంగా, ఎన్.ఆర్.ఇ.పి, ఆర్.ఎల్.ఇ.జి.పి వంటి గ్రామీణ పథకాలు ఎస్.సి, ఎస్.టీలకు చెందిన పేదరైతుల భూములలో వ్యవసాయ బావులు త్రవ్వించే కార్యక్రమాన్ని రాష్ట్రవ్యాప్తంగా, పెద్ద ఎత్తున చేపట్టి వారి సంక్షేమానికి ఎనలేని కృషిచేసారు.

బొగ్గుగనులు జాతీయం చెయ్యడంలోను, ప్రభుత్వానికి నక్సల్‌తో జరిగిన శాంతి చర్చలలో చురుకైన పాత్ర వహించారు. మన రాష్ట్రం నుంచి త్రిపుర రాష్ట్రానికి చీఫ్ సెక్రటరిగా వెళ్ళినప్పుడు, విమానం దిగి, బయటకు వచ్చి, రిక్షా మాట్లాడుకొని సర్క్యూట్ హౌస్‌కు బయలుదేరే సమయంలో స్వాగతం చెప్పడానికి వచ్చిన

అధికారులు గబగబా రిక్షా దగ్గరకు వచ్చి వారిని గుర్తించలేకపోయినందుకు పశ్చాత్తాపపడి, వారిని రిక్షానుండి సాదరంగా తోడ్కొని వెళ్ళారు. కాని శంకరన్ గారు తనవల్ల రిక్షావాడు నష్టపోకూడదు అని అతని డబ్బులు చెల్లించిన నిరాడంబరుడు.

అటవీ హక్కుల చట్టం వచ్చిన తర్వాత దాని అమలుకు ప్రభుత్వం ఏర్పరిచిన 19 మంది సభ్యుల కమిటీకి శంకర్ నాయకత్వం వహించారు. నక్సల్స్ ప్రభావిత ప్రాంతాల్లో అభివృద్ధి పనులు చేపట్టడానికి ఎదురయ్యే సవాళ్ళపై అధ్యయనం చేయడానికి ప్రణాళిక సంఘం నియమించిన కమిటీలో సభ్యుడిగా కూడ పనిచేసారు. ప్రభుత్వేతర సంస్థల్లో కూడ పనిచేశారు.

అంతర్జాతీయ సంస్థలు ముఖ్యంగా ఐక్యరాజ్యసమితి, సర్వోన్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు వంటి సంస్థలు శంకరన్ గారిని సలహాదారునిగా నియమించుకొని, సర్వేలు చేపట్టవలసినదిగా కోరేవారు. ఆయనకున్న అనుభవం, పేదలపట్ల ఆయనకున్న అవగాహన, పేదల పక్షపాతిగా, ఆయన రూపకల్పన చేసిన ప్రణాళికలు రీత్యా, ఈ భాధ్యతలు ఆయనకు అప్పగించేవారు.

మానవతా విలువలు మనసునిండా నింపుకొని చిత్తశుద్ధితో పనిచేసే అధికారిగా దళితులు, అధికారులు, ప్రజల మన్నన పొందిన ఆయన ఎంతోమంది యువ అధికారులకు స్ఫూర్తిగా నిలచి, ఎందరో పేద దళిత యువకులకు తన సొంత డబ్బులతో విద్యాబుద్ధులు నేర్పించారు. ఎందరో దళితయువ అధికారులను తీర్చిదిద్ది వారికి, పరిపాలన అంటే ఆలనాపాలనా లేని పేదల జీవితాల్లో వెలుగులు నింపాలని కర్తవ్య భోదచేస్తూ వారిని ఉత్తేజ పరిచేవారు. శంకరన్‌గారు దేశం గర్వించదగ్గ అత్యున్నత సివిల్ సర్వీస్ అధికారి. అంతేకాదు, వారు చేసిన సేవలకు గుర్తింపుగా భారత ప్రభుత్వం ఇచ్చిన పద్మభూషణ పురస్కారాన్ని అతి సున్నితంగా తిరస్కరించిన నిరాడంబరుడు, వారిని ఆదర్శంగా తీసుకొని, ప్రతి సంక్షేమ మరియు విద్యా సహాయకుడు తన కర్తవ్యాలను నిర్వహిస్తారని ఆశిస్తూ...

సాంఘిక సంక్షేమశాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

## నవరత్నాలు

### సంక్షేమ మరియు విద్యా సహాయకుని పరిధిలోని అంశాలు

1) ఫీజు రీయింబర్స్‌మెంట్ :

అమలు చేయబడిన పథకాలు

ఎ) జగనన్న విద్యా దీవెన (పూర్తి ఫీజు రీయింబర్స్‌మెంట్)

బి) జగనన్న వసతి దీవెన (ప్రతి విద్యార్థికి వసతి, భోజనం కొరకు అదనంగా సంవత్సరానికి రూ. 20 వేలు)

2) అమ్మ ఒడి:

ఎ) పిల్లలను బడికి పంపే ప్రతి తల్లికి సంవత్సరానికి రూ. 15000/- రాష్ట్ర ప్రభుత్వం చెల్లిస్తుంది. ఈ పథకాన్ని ఇంటర్ మీడియట్ వరకు విస్తరించబడినది.

3) వైఎస్సార్ చేయూత:

45 సంవత్సరాలు నిండిన ప్రతి బి.సి., ఎస్సీ, ఎస్టీ, మైనారిటీ మహిళకు 2020-21 నుండి నాలుగేళ్ళలో రూ. 75 వేలు దశలవారీగా ఆయా కార్పోరేషన్ల ద్వారా ఉచితంగా ఇవ్వబడుతుంది.

4) వైఎస్సార్ ఆసరా:

ఎ) ఏప్రిల్ 11, 2019 నాటికి పొదుపు సంఘాల రుణాల మొత్తం సొమ్మును 4 దఫాలుగా నేరుగా మహిళల చేతిలో అందించటం.

బి) సున్నా వడ్డీకే రుణాలు ఇప్పించడం. ప్రభుత్వమే వడ్డీ డబ్బులు బ్యాంకులకు కట్టడం.

5) ఫించన్ల పెంపు:

ఎ) ప్రస్తుతం వున్న ఫించన్ల అర్హత వయస్సు 65 నుండి 60కు తగ్గించడమైనది.

బి) ఫించను మొత్తాన్ని దశల వారీగా రూ. 3000/-కు పెంచడం. దానిలో భాగంగా జూన్ 2019 నుండి రూ.2250/- కు పెంచడం జరిగినది.

# బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు

**బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు**

బలహీన వర్గాల విద్య, సామాజిక మరియు ఆర్థికాభివృద్ధి కొరకు అమలు పరచబడుచున్న పథకములు మరియు ఏర్పాటు చేయబడుచున్న ప్రత్యేక సంస్థలతో పాటు, ప్రభుత్వం ఇటీవల కొన్ని చారిత్రాత్మకమైన చట్టాలను కూడా చేయడం జరిగినది. వెనుకబడిన తరగతుల వారి అభివృద్ధిలో ఈ నూతన చట్టాల పాత్ర ఎంతగానో ఉంటుంది అనడంలో ఏ మాత్రమూ అతిశయోక్తి లేదు. నూతనంగా చేయబడిన చట్టాల వివరములు క్రింద తెలియ జేయడమైనది.

1) **బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ పదవులలో 50% రిజర్వేషన్ కల్పించుట (యాక్టు నెం. 24 ఆఫ్ 2019) :**

- బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ పదవులలో 50% రిజర్వేషన్ కల్పించు నిమిత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే యాక్టు నెం. 24 ఆఫ్ 2019.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 62, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 ద్వారా అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 77, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 27-09-2019 ద్వారా జారీ చేయడం జరిగినది.
- కల్పించబడిన 50% రిజర్వేషన్‌ను ఈ క్రింది విధంగా వివిధ కేటగిరీల మధ్య విభజించడం జరుగుతుంది.
  బి.సి మరియు మైనారిటీలు - 29%, ఎస్.సి. - 15%, ఎస్.టి. - 6%
- సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను ఈ చట్టాన్ని అమలు పరచుటకు నోడల్ శాఖగా ప్రభుత్వం గుర్తించి, తగు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.

## బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు

- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌లను అభివ ద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది.

2) బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు మరియు సర్వీసు కాంట్రాక్టులలో 50% రిజర్వేషన్ కల్పించుట (యాక్టు నెం. 25 ఆఫ్ 2019) :

- బి.సి., ఎస్.సి., ఎస్.టి. మరియు మైనారిటీలకు నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు మరియు సర్వీసు కాంట్రాక్టులలో 50% రిజర్వేషన్ కల్పించు నిమిత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే యాక్టు నెం. 25 ఆఫ్ 2019.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 63, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 ద్వారా అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 74, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 16-09-2019 ద్వారా జారీ చేయడం జరిగినది.

  కల్పించబడిన 50% రిజర్వేషన్‌ను ఈ క్రింది విధంగా వివిద కేటగిరీల మద్య విభజించడం జరుగుతుంది.

  బి.సి మరియు మైనారిటీలు - 29%, ఎస్.సి. - 15%, ఎస్.టి. - 06%

- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులకు సంబందించి పంచాయితీ రాజ్ శాఖను (పంచాయితీ రాజ్ డిపార్టుమెంట్), నామినేటెడ్ సర్వీసు కాంట్రాక్టులకు సంబంధించి సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను నోడల్ శాఖలుగా ప్రభుత్వం గుర్తించి, తగు అమలు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.

## బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు

- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు పొందడానికి మరియు నామినేటెడ్ సర్వీస్ కాంట్రాక్ట్ పొందడానికి ఆయా వర్గాలకు చెందిన వారు రిజిస్ట్రేషన్ సంబంధిత అధికారుల వద్ద చేయించుకోవాలి.
- రిజిస్ట్రేషన్ చేయించుకొనుట కొరకు, ఒక ప్రత్యేక డ్రైవ్‌ను (స్పెషల్ డ్రైవ్) చేపట్టడం జరుగుతుంది. ఈ వర్గాలకు చెందిన వారు రిజిస్ట్రేషన్ చేసుకొనుట కొరకు అవసరమైన సాల్వెన్సీ సర్టిఫికేటు మరియు ఎక్స్పీరియన్స్ సర్టిఫికేట్ విషయంలో మినహాయింపు ఇవ్వడమైనది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది. ఇందు కొరకు ఒక ప్రత్యేక 100 పాయింట్ల రోస్టర్‌ను కూడా అభివృద్ధి చేయడం జరిగినది.

**3) శాశ్వత ప్రాతిపదికన బి.సి. కమీషన్ ఏర్పాటు (యాక్టు నెం. 19 ఆఫ్ 2019):**

- బి.సి. కమీషన్‌ను శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు చేయు నిమిత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే యాక్టు నెం. 19 ఆఫ్ 2019.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 61, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 ద్వారా అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 66, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 30-08-2019 ద్వారా జారీ చేయడం జరిగినది.
- గౌరవనీయులు రిటైర్డ్ జస్టిస్ శ్రీ ఎ. శంకర నారాయణ గారిని బి.సి. కమీషన్ ఛైర్మన్‌గా నియమిస్తూ జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 73, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 12-09-2019 ద్వారా ఉత్తర్వులను ప్రభుత్వం జారీ చేయడం జరిగినది.

# బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు

**బి.సి. కమీషన్ కార్యకలాపాలు :**

- వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చమని వివిధ కులాల వారు చేయు అభ్యర్థనలను పరిశీలించడం.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 74, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 16-09-2019 ద్వారా జారీ చేయడం జరిగినది.
- కల్పించబడిన 50% రిజర్వేషన్‌ను ఈ క్రింది విధంగా వివిధ కేటగిరీల మధ్య విభజించడం జరుగుతుంది.

  బి.సి మరియు మైనారిటీలు - 29%, ఎస్.సి. - 15%, ఎస్.టి. - 06%
- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులకు సంబందించి పంచాయితీ రాజ్ శాఖను (పంచాయితీ రాజ్ డిపార్టుమెంట్), నామినేటెడ్ సర్వీసు కాంట్రాక్టులకు సంబంధించి సాధారణ పరిపాలన శాఖ (జనరల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంట్) ను నోడల్ శాఖలుగా ప్రభుత్వం గుర్తించి, తగు అమలు బాధ్యతలను అప్పజెప్పడం జరిగినది.
- ఈ చట్టానికి లోబడి, నామినేటెడ్ కాంట్రాక్ట్ పనులు పొందడానికి మరియు నామినేటెడ్ సర్వీస్ కాంట్రాక్ట్ పొందడానికి ఆయా వర్గాలకు చెందిన వారు రిజిస్ట్రేషన్ సంబంధిత అధికారుల వద్ద చేయించుకోవాలి.
- రిజిస్ట్రేషన్ చేయించుకొనుట కొరకు, ఒక ప్రత్యేక డ్రైవ్‌ను (స్పెషల్ డ్రైవ్) చేపట్టడం జరుగుతుంది. ఈ వర్గాలకు చెందిన వారు రిజిస్ట్రేషన్ చేసుకొనుట కొరకు అవసరమైన సాల్వెన్సీ సర్టిఫికేటు మరియు ఎక్స్పీరియన్స్ సర్టిఫికేట్ విషయంలో మినహాయింపు ఇవ్వడమైనది.
- ఈ చట్టాన్ని సక్రమంగా మరియు పారదర్శకంగా అమలు చేయుటకు ఒక ప్రత్యేక వెబ్ పోర్టల్‌ను అభివృద్ధి పరచి అమలులోకి తీసుకురావడం జరుగుతుంది. ఇందు కొరకు ఒక ప్రత్యేక 100 పాయింట్ల రోస్టర్‌ను కూడా అభివృద్ధి చేయడం జరిగినది.

# బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు

3) శాశ్వత ప్రాతిపదికన బి.సి. కమీషన్ ఏర్పాటు (యాక్టు నెం. 19 ఆఫ్ 2019):

- బి.సి. కమీషన్‌ను శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు చేయు నిమిత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఒక నూతన చట్టాన్ని తీసుకురావడం జరిగినది. అదియే యాక్టు నెం. 19 ఆఫ్ 2019.
- ఈ నూతన చట్టాన్ని జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 61, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 19-08-2019 ద్వారా అమలులోకి తీసుకురావడం జరిగినది.
- ఈ నూతన చట్టాన్ని అమలు పరచుటకు అవసరమైన రూల్స్ (నియమములు) ను జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 66, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 30-08-2019 ద్వారా జారీ చేయడం జరిగినది.
- గౌరవనీయులు రిటైర్డ్ జస్టిస్ శ్రీ ఎ. శంకర నారాయణ గారిని బి.సి. కమీషన్ చైర్మన్‌గా నియమిస్తూ జి.ఓ.ఎమ్.ఎస్. నెం. 73, వెనుకబడిన తరగతుల సంక్షేమ (ఎఫ్) శాఖ, తేది. 12-09-2019 ద్వారా ఉత్తర్వులను ప్రభుత్వం జారీ చేయడం జరిగినది.

బి.సి. కమీషన్ కార్యకలాపాలు :

- వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చమని వివిధ కులాల వారు చేయు అభ్యర్థనలను పరిశీలించడం.
- వెనుకబడిన తరగతుల జాబితాలో ఇదివరకే ఉన్న కులాల నుండి వచ్చు గ్రూపు మార్పిడి అభ్యర్థనలను పరిశీలించడం.
- వెనుకబడిన తరగతుల జాబితాలో క్రొత్తగా కులాలను చేర్చుటపైన (అండర్ ఇంక్లూజన్) మరియు జాబితాలో ఇదివరకే ఉన్న కులాల తొలగింపు పైన (ఓవర్ ఇంక్లూజన్) వచ్చు ఫిర్యాదులను పరిశీలించడం.

# బలహీన వర్గాల బలోపేతానికి మూడు నూతన చట్టాలు

- విద్యా సంస్థల ప్రవేశాలలో మరియు ఉద్యోగ నియామకాలలో రూల్ ఆఫ్ రిజర్వేషన్‌ను అమలు పరచడంలో వచ్చు ఫిర్యాదులను పరిశీలించడం.
- నిర్దేశించబడిన కాల వ్యవధి ప్రకారం వెనుకబడిన తరగతుల విద్య, సామాజిక మరియు ఆర్థిక ప్రగతిని తగు సర్వే ద్వారా పరిశీలించడం.
- వెనుకబడిన తరగతులు సాధించు పురోగతి మరియు అభివృద్ధి స్థాయిలను అంచనా వేయడం.
- వెనుకబడిన తరగతులకు చెందిన వివిధ కులాలు సాధించు పురోగతి మరియు అభివృద్ధి స్థాయిలను పోల్చడం, ఏవైనా కులాలు తగినంతగా పురోగతి మరియ అభివృద్ధి సాదించలేక వెనుకబడి పోవడాన్ని గమనించిన ఎడల, అట్టి కులాలను వెనుకబడిన తరగతులలోనే ప్రత్యేకంగా గుర్తించి వారిని అత్యంత వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చడానికి సిఫారసు చేయడం.
- వెనుకబడిన తరగతులకు చెందిన కులాలలో కొన్నింటిని అత్యంత వెనుకబడిన తరగతులుగా గుర్తించడం జరిగినది. మొత్తం 139 కులాలు వెనుకబడిన తరగతుల జాబితాలో ఉండగా, 32 కులాలు అత్యంత వెనుకబడిన జాబితాలో చేర్చబడి ఉన్నవి. పేరుకు తగ్గట్టుగా ఈ 32 కులాలు అన్ని రంగాలలోనూ వెనుకబడిన తరగతులలోని ఇతర కులాల కంటే కూడా ఇంకా వెనుకబడి ఉన్నవన్నమాట. కనుక, వాటి అభివృద్ధికి అవసరమైన రక్షణాత్మక చర్యలను చేపట్టుటకు తగిన సూచనలు, సలహాలు ఇవ్వడం.
- వెనుకబడిన తరగతులకు చెందిన వారిపైన చోటు చేసుకునే అట్రాసిటీస్ మీద మరియు సామాజిక బహిష్కరణలపైన తగు విచారణ జరపడం.
- పైన తెలియజేసిన అంశములపై బి.సి. కమీషన్ తగు పరిశీలన / అధ్యయనం అనంతరం తన సూచనలు, సలహాలు మరియు సిఫారసులతో కూడిన నివేదికను ప్రభుత్వమునకు అందజేస్తుంది. ఆ నివేదికను పరిశీలించి, ప్రభుత్వం తగు చర్యలను చేపట్టడం జరుగుతుంది.

## బలహీన వర్గాలకు సంక్షేమ పథకాలు (ఎస్సీ, ఎస్టీ, బి.సి, మైనారిటీ, ఇ.బి.సి. లకు)
## జగనన్న విద్యా దీవెన మరియు వసతి దీవెన

**పూర్తిఫీజు చెల్లింపు (రీయింబర్స్‌మెంట్):**

- కళాశాలలలో చదువుతున్న ప్రతి పేద విద్యార్థికి చదువుకు అయ్యే పూర్తి ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. పూర్తి ఫీజు చెల్లింపుతో పాటుగా ప్రతి విద్యార్థికి భోజన, వసతి సదుపాయము కొరకు సంవత్సరానికి రూ. 20,000/- ఇవ్వబడుతుంది.

పై హామీకి అనుగుణముగా ప్రభుత్వము రెండు పథకాలను రూపొందించినది:

1. జగనన్న విద్యాదీవెన (RTF)
2. జగనన్న వసతి దీవెన (MTF)

పథకాలు వర్తించే తేది : 2019 - 20 విద్యా సంవత్సరము నుండి పై రెండు పథకాలు వర్తిస్తాయి.

**విద్యార్థుల అర్హత:**

- స్టేట్ యూనివర్సిటీ/బోర్డ్‌లకు అనుబంధంగా ఉన్న ప్రభుత్వ/ఎయిడెడ్/ప్రైవేట్ కాలేజీలలో పాలిటెక్నిక్, ఐ.టి.ఐ. మరియు డిగ్రీ & ఆ పైస్థాయి కోర్సులు చదువుతున్న అందరు విద్యార్థులు.
- డే స్కాలర్, కాలేజీ అనుబంధ హాస్టళ్ళు, డిపార్టుమెంటు అనుబంధ హాస్టళ్ళ విద్యార్థులు అర్హులు
- స్కాలర్‌షిప్ విడుదలకు 75% హాజరు తప్పనిసరి

**విద్యార్థుల అనర్హత:**

- ప్రైవేట్/డీమ్డ్ యూనివర్శిటీ విద్యార్థులు కరెస్పాండెన్స్ / డిస్టెన్స్ ఎడ్యుకేషన్ చదివే విద్యార్థులు
- మేనేజ్మెంట్ / స్పాట్ అడ్మిషన్ పొందే విద్యార్థులు

# బలహీన వర్గాలకు సంక్షేమ పథకాలు (ఎస్సీ, ఎస్టీ, బి.సి, మైనారిటీ, ఇ.బి.సి. లకు)

# జగనన్న విద్యా దీవెన మరియు వసతి దీవెన

| ఆదాయ అర్హత | |
|---|---|
| కుటుంబ సంవత్సర ఆదాయం<br>కుటుంబ యొక్క మొత్తం వ్యవసాయ భూమి | రూ. 2.50 లక్షలకు సమానమైన లేదా తక్కువ<br>10.00 ఎకరాలకన్నా తక్కువ మాగాణి (లేదా) 25.00 ఎకరాల కన్నా తక్కువ గల మెట్ట భూమి (లేదా) మాగాణి మరియు మెట్ట కలిపి 25.00 ఎకరాలలోపు |
| ప్రభుత్వ ఉద్యోగి / పింఛనుదారుడు | కుటుంబ సభ్యులలో ఏ ఒక్కరు కూడా ప్రభుత్వ ఉద్యోగం కాని లేక పింఛనుదారుడు కాని అయి ఉండకూడదు. (జీతము మరియు ఉద్యోగ భర్తీకి సంబంధం లేకుండా శానిటరీ వర్కర్లు అందరు అర్హులే) |
| నాలుగు చక్రాల వాహనం | కుటుంబ సభ్యులలో ఏ ఒక్కరు కూడా నాలుగు చక్రాల వాహనం కలిగి ఉండరాదు. (టాక్సీ/ట్రాక్టర్/ఆటోలకు మినహాయింపు గలదు.) |
| ఆదాయ పన్ను | కుటుంబంలో ఏ వ్యక్తి కూడా ఆదాయ పన్ను చెల్లింపుదారు అయి ఉండరాదు. |
| పట్టణ ప్రాంతం లోని ఆస్థి | ఆస్థి లేకుండా లేదా 1500 sft కన్నా తక్కువ బిల్డప్ ఏరియా (Builtup Area) (నివాస లేదా వాణిజ్య భవనము) కలిగి కుటుంబం అర్హులు. |

## బలహీన వర్గాలకు సంక్షేమ పథకాలు (ఎస్సీ, ఎస్టీ, బి.సి, మైనారిటీ, ఇ.బి.సి. లకు)
## జగనన్న విద్యా దీవెన మరియు వసతి దీవెన

### పంపిణీ విధానం

జగనన్న విద్యా దీవెన

- పూర్తి ఫీజు విద్యార్థుల తరపున సంబంధిత కళాశాల ఖాతాలకు జమ అవుతుంది.

జగనన్న వసతి దీవెన

- మెయింటెన్స్ (స్కాలర్‌షిప్) మొత్తం అర్హత గల విద్యార్థి తల్లి యొక్క సంబంధిత ఖాతాలో జమ అవుతుంది.
- ఒక వేళ తల్లి మరణించిన యెడల, ఆ మొత్తం విద్యార్థి యొక్క సహజ సంరక్షకుడి (Natural Guardian) ఖాతాకు జమ చేయబడతుంది.

### ఎంటైటిల్మెంట్ (**Entitlements**)

జగనన్న విద్యాదీవెన

- సమర్థ అధికార సంస్థ (Competent Authority) నిర్ణయించిన ఫీజు, అర్హత గల విద్యార్థులందరికీ పూర్తిగా తిరిగి చెల్లించబడుతుంది.
- పూర్తి ఫీజు విద్యార్థుల తరపున సంబంధిత కళాశాల ఖాతాలకు జమ అవుతుంది.

జగనన్న వసతి దీవెన

- ప్రతి విద్యార్థికి సంవత్సరానికి రూ. 20,000/- చొప్పున రెండు విడతలుగా జూలై మరియు డిసెంబర్ నెలలో డే-స్కాలర్లకు, కాలేజి అనుబంధ హాస్టళ్ళు మరియు డిపార్టుమెంట్ అనుబంధ హాస్టళ్ళకు అందజేయాలి.
- జగనన్న వసతి దీవెన కుటుంబంలోని అర్హతగల పిల్లలందరికీ వర్తిస్తుంది.

# బలహీన వర్గాలకు సంక్షేమ పథకాలు (ఎస్సీ, ఎస్టీ, బి.సి, మైనారిటీ, ఇ.బి.సి. లకు)
# జగనన్న విద్యా దీవెన మరియు వసతి దీవెన

| విద్యార్థుల కేటగిరి | చెల్లింపు షెడ్యూల్ |
|---|---|
| డే స్కాలర్ విద్యార్థులు | రూ. 10,000/- (2019-20 సం\|\|నికి డిసెంబర్‌లో చెల్లించబడును.<br>రూ. 20,000/- (2020-21 నుండి) రెండు దఫాలుగా విడుదల చేయబడును. |
| కాలేజి అనుబంధ హాస్టల్ విద్యార్థులు, | రూ. 20,000/- (2019-20) నుండి రెండు దఫాలుగా చెల్లించబడును. |
| డిపార్టుమెంటు అనుబంధ హాస్టల్ విద్యార్థులు | ❑ నెలకు రూ. 1600/- (2019-20 నుండి) విద్యార్థి ఉన్న హాస్టల్ వెల్ఫేర్ ఆఫీసర్ (వార్డెన్) ఖతాకు జమ కాబడును.<br>❑ బాలెన్స్ మొత్తము విద్యార్థి తల్లి ఖాతాకు రెండు దఫాలుగా అనగా జూలై మరియు డిసెంబర్ నెలలో సుర్దుబాటు చేయబడును. |

తల్లి బ్యాంకు ఖాతా వివరముల మ్యాపింగ్ (**Mapping**)

వెల్ఫేర్ అండ్ ఎడ్యుకేషన్ అసిస్టెంట్ పాత్ర

- ❑ తల్లి – విద్యార్థి మ్యాపింగ్
- ❑ తల్లి బ్యాంకు ఖాతా వివరములు నమోదు మరియు డాక్యుమెంట్ అప్లోడు (Upload)
- ❑ ఖాతా వివరాల యొక్క యదార్థతను ధృవీకరించుట

## ప్రీ మెట్రిక్ మరియు పోస్ట్ మెట్రిక్ (కళాశాల) వసతి గృహాలు

**ఈ పథకం యొక్క లక్ష్యం :**

- ప్రాథమిక, సెకండరీ, కళాశాల స్థాయిలలో విద్యార్థులకు ఉచిత వసతితో కూడిన నాణ్యమైన విద్యను అందించే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ప్రీ మెట్రిక్, కళాశాల వసతి గృహాలను నిర్వహిస్తుంది.
- ఈ పథకము ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ, ఇ.బి.సి, విభిన్న ప్రతిభావంతులైన విద్యార్థులకు వర్తిస్తుంది. అర్హత కలిగిన విద్యార్థులు హాస్టల్స్ లో ఉచిత భోజన, వసతులను పొందవచ్చును.

**అర్హత :**

- తెల్ల రేషన్ కార్డు ఉండి ప్రభుత్వ, ఎయిడెడ్ పాఠశాలలలో 3 నుండి 10 తరగతి వరకు చదువుచున్న విద్యార్థులు ప్రీ మెట్రిక్ హాస్టల్స్‌లోను మరియు అన్ని రకాల ప్రభుత్వ, ప్రైవేటు కళాశాలల్లో చదువుతున్న విద్యార్థులు కళాశాల వసతి గృహాల్లోను వసతి పొందడానికి అర్హులు.

**ప్రభుత్వం నిర్వహిస్తున్న వసతి గృహాల సంఖ్య :**

- రాష్ట్రంలో సంక్షేమ శాఖలు 2171 ప్రీ మెట్రిక్ హాస్టల్స్‌ను మరియు 827 కళాశాల వసతి గృహాలను మూడు లక్షల మంది విద్యార్థులతో నిర్వహిస్తున్నవి.

**ప్రభుత్వం కల్పిస్తున్న సదుపాయాలు :**

ప్రతి విద్యార్థికి 4 జతల దుస్తులు, స్టేషనరీ సామాగ్రి , ప్లేట్స్ , గ్లాసులు దుప్పట్లు, కార్పెట్లు నిర్ణయించిన స్కేలు ప్రకారం ప్రీ-మెట్రిక్ విద్యార్థులకు అందచేయబడుచున్నవి. ఈ హాస్టల్స్ లో డిజిటల్ తరగతి గదులు ఏర్పాటు చేయుటకు సంకల్పించబడినది. బయో మాట్రిక్ హాజరు అమలు చేయబడుచున్నది. వసతి గృహాలకు ట్యాబ్‌లు, లాప్ ట్యాబ్‌లు ఇవ్వబడినవి. ఆహార, కాస్మోటిక్ మరియు ఇతర ఖర్చుల బిల్లులు అన్ లైన్ నందు జ్ఞానభూమి ఆధారిత బయో మాట్రిక్ హాజరు సహితంగా చేయబడతాయి.

# ప్రీ మెట్రిక్ మరియు పోస్ట్ మెట్రిక్ (కళాశాల) వసతి గృహాలు

- సాంఘిక సంక్షేమ శాఖకు చెందిన ఒక్కొక్క కళాశాల వసతి గృహంలోని విద్యార్ధులకు నైపుణ్యాభివృద్ధి శిక్షణ (స్పోకెన్ ఇంగ్లీష్, కంప్యూటర్ శిక్షణ) ఇచ్చుటకు 20 కంప్యూటర్లతో కంప్యూటర్ ల్యాబ్ ఏర్పాటు చేయబడినది.

దరఖాస్తు చేయు విధానం :

- గామ/వార్డు వాలంటీరు ద్వారా/ గ్రామ/వార్డు సచివాలయం ద్వారా దరఖాస్తు ను సమర్పించి వెంటనే హాస్టల్ లో ప్రవేశాన్ని పొందవచ్చు.

డైట్ ఛార్జీల వివరాలు:

| తరగతులు | విద్యాలయాల రకాలు | ప్రస్తుతం పెంచిన డైట్ ఛార్జీలు (01-07-2018 నుండి) |
|---|---|---|
| III & IV | ప్రీ-మెట్రిక్ వసతి గృహాలు/రెసిడెన్సియల్ పాఠశాలలు | రూ. 1000/- |
| V, VI & VII | ప్రీ-మెట్రిక్ వసతి గృహాలు/రెసిడెన్సియల్ పాఠశాలలు | రూ. 1250/- |
| VIII, IX & X | ప్రీ-మెట్రిక్ వసతి గృహాలు/రెసిడెన్సియల్ పాఠశాలలు | రూ. 1250/- |

# ప్రీ మెట్రిక్ మరియు పోస్ట్ మెట్రిక్ (కళాశాల) వసతి గృహాలు

కాస్మోటిక్ మరియు ఇతర చార్జీల వివరాలు:

| క్ర.మ | విషయము | తరగతి | (01-07-2018 నుండి) ఛార్జీలు |
|---|---|---|---|
| 1 | కాస్మోటిక్ ధరలు | 3 నుండి 6వ తరగతుల విద్యార్థులకు | రూ.100 బాలురుల కోసం<br>రూ.110 బాలికల కోసం |
| | | 7వ తరగతి విద్యార్థులకు | రూ.125 బాలురుల కోసం<br>రూ.160 బాలికల కోసం |
| | | 8, 9 మరియు 10వ తరగతి విద్యార్థులకు | రూ.125 బాలురుల కోసం<br>రూ.160 బాలికల కోసం |
| 2 | హెయిర్ కట్ ధరలు | 3వ తరగతి, ఆపై తరగతుల విద్యార్థులకు | రూ.30/- నెలకు |
| 3 | కుట్టు ధరలు (బాలురు మరియు బాలికలకు) | | రూ.80/- జతకు |

## ప్రీ మెట్రిక్ ఉపకార వేతనములు – 9, 10 వ తరగతులకు

ఈ పథకం యొక్క లక్ష్యం :

- సెకండరి స్థాయిలో డ్రాప్ ఔట్స్‌ను నిరోధించి, రిటెన్షన్ రేటును పెంచే ఉద్దేశ్యంతో ఈ పథకాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది.

అర్హత :

- ఈ పథకము ప్రభుత్వ, మున్సిపల్, జిల్లా పరిషత్, మండల పరిషత్ మరియు ఎయిడెడ్ స్కూళ్లలో 9,10వ తరగతులు చదివే ఎస్.సి., ఎస్.టి., బి.సి., విభిన్న ప్రతిభావంతులైన డే స్కాలర్ మరియు సంక్షేమ హాస్టల్‌లో వుండే విద్యార్థులకు వర్తించును.
- ఎస్.సి., ఎస్.టి., విద్యార్థుల కుటుంబ సంవత్సరం ఆదాయం 2 లక్షలు లోపు మరియు బి.సి. విద్యార్థులకు రూ.44,500/- లోపు ఉండవలెను.
- 9,10 తరగతులు చదివే డే-స్కాలర్ విద్యార్థులకు సంవత్సరానికి రూ.2250/- మరియు హాస్టల్ విద్యార్థులకు సంవత్సరానికి రూ.4500/- చెల్లించబడును.

దరఖాస్తు చేయు విధానం :

- గ్రామ/వార్డు వాలంటీరు ద్వారా, గ్రామ/వార్డు సచివాలయం ద్వారా ష్ట్ః్జూర://యఅంఐఅంపష్ట్రబఎఱ.ఇజూ.స్త్రశీఙ.ఱఅ వెబ్ సైట్ నందు విద్యార్థులు తమ దరఖాస్తులను సమర్పించ వలెను. ప్రీ మెట్రిక్ ఉపకార వేతనాలు విద్యార్థుల బ్యాంకు అకౌంట్ లోనికి నేరుగా విడుదల చేయబడతాయి..

# బెస్ట్ అవైలబుల్ స్కూల్స్- రెసిడెన్షియల్ & నాన్ రెసిడెన్షియల్

**ఈ పథకం యొక్క లక్ష్యం :**

- ఎంపిక చేసిన ఎస్.సి., ఎస్.టి. విద్యార్థులకు జిల్లాలలోని ఉత్తమ ప్రైవేటు పాఠశాలల్లో, ఆంగ్ల మాధ్యమములో నాణ్యమైన విద్యను, రెసిడెన్షియల్ (ఎస్.సి., ఎస్.టి) మరియు నాన్ రెసిడెన్షియల్ (ఎస్.సి) విధానంలో అందించే లక్ష్యం తో ఈ పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది.

**అర్హత :**

- తెల్ల రేషన్ కార్డు ఉన్న కుటుంబాలకు చెందిన ఎస్.సి, ఎస్.టి., విద్యార్థులు అర్హులు.
- ఈ పథకము ద్వారా ఎస్.సి., విద్యార్థులు ఎంపిక చేసిన పాఠశాలలలో, 5వ తరగతి నుండి 10వ తరగతి వరకు మరియు ఎస్.టి., విద్యార్థులు1వ తరగతి నుండి 10 వ తరగతి వరకు రెసిడెన్షియల్ విధానంలోను మరియు ఎస్.సి., విద్యార్థులు, 1వ తరగతి నుండి 10 వ తరగతి వరకు నాన్-రెసిడెన్షియల్ విధానంలోనువిద్యను అభ్యసిస్తారు.

**ఉపకార వేతనాలు చెల్లింపు :**

- ఈ పథకం క్రింద రెసిడెన్షియల్ విధానంలో సంవత్సరానికి రూ.30 వేల రూపాయలు మరియు నాన్ రెసిడెన్షియల్ విధానంలో సంవత్సరానికి రూ.20 వేల రూపాయలను గరిష్టంగా, స్కూల్స్ యాజమాన్యానికి, విద్యార్థుల తరుపున ఆన్ లైన్ లో వజూ౦రర వెబ్ సైట్ ద్వారా  చెల్లించబడును.
- విద్యార్థి నుండి ఎటువంటి అదనపు రుసుము వసూలు చేయబడదు.

**ధరఖాస్తు చేయు విధానం :**

- గ్రామ/వార్డు వాలంటీరు ద్వారా/ గ్రామ/వార్డు సచివాలయం ద్వారా లేదా https://epass.apcfss.in వెబ్ సైట్ నందు విద్యార్థులు తమ దరఖాస్తులను సమర్పించ వలెను. ప్రతి సంవత్సరం మే నెలలో 1, 3వ తరగతులలోనికి విద్యార్థుల ఎంపిక ఆన్ లైన్ లాటరీ ద్వారా, మరియు 5, 8 తరగుతులకు **B.A.S.CET** ద్వారా జిల్లాకు కేటాయించిన సీట్ల వరకు జరుగును.

## కార్పోరేట్ కళాశాలలలో విద్యా పథకం

**నేపధ్యం :**

పేద ఎస్సీ/ఎస్టీ/బి.సి/ఇ.బి.సి/మైనారిటీ వర్గాలకు చెందిన మెరిట్ విద్యార్థులు ఇంటర్‌మీడియట్‌లో పేరుగాంచిన కార్పోరేట్ కళాశాలలో రెసిడెన్షియల్ విధానంలో చేరి, నాణ్యత కల విద్యను పొంది ఐ.ఐ.టిలలో, పేరుగాంచిన/ఇంజనీరింగ్/మెడికల్ కళాశాలలో సీట్లు తెచ్చుకొనేందుకు ఆర్థిక సహాయం అందించటం ఈ పథకం లక్ష్యం. 3238 మంది విద్యార్థులకు ప్రతి సంవత్సరం ఈ పథకం క్రింద చేర్పించటం జరుగుతుంది.

**అర్హత:**

1. పదవ తరగతిలో కనీసం 7 జి.పి.ఎ తెచ్చుకున్నవారు.
2. ఎస్సీ, ఎస్టీ, విద్యార్తులకు సంవత్సర ఆదాయం రెండు లక్షలు మించరాదు.
3. బి.సి, ఇ.బి.సి, మైనారిటీ విద్యార్థుల కుటుంబ సంవత్సర ఆదాయం ఒక లక్షకు మించరాదు.

**సీట్ల కేటాయింపు:**

ఎ) వసతి గృహాలు, ఆశ్రమ పాఠశాలలు, KGBV లలో చదివిన విద్యార్థులకు – 50% సీట్లు కేటీయింపు.

బి) ప్రభుత్వ/మున్సిపల్/ZP/ఎయిడెడ్ పాఠశాల విద్యార్థులకు – 25%

సి) ప్రభుత్వ సంక్షేమ గురుకుల విద్యార్థులకు, నవోదయ విద్యార్థులకు – 20%

డి) Best Available Schools లో చదివిన ఎస్సీ/ఎస్టీ విద్యార్థులకు – 5%

ఇ) మొత్తం సీట్లలో 60% బాలికలకు, 3% వికలాంగులకు

# కార్పోరేట్ కళాశాలలలో విద్యా పథకం

**ఆర్థిక సహాయం:**

ఎంపిక కాబడిన కళాశాలలో చేరిన తదుపరి, సంవత్సరమునకు రూ.35,000 మించకుండా కళాశాలకు ఫీజు చెల్లించబడును. విద్యార్థికి రూ.3000 Pocket Money గా చెల్లించబడును.

**దరఖాస్తుచేయు విధానం:**

ప్రతి సంవత్సరం మే నెలలో jnanabhumi.ap.gov.in ద్వారా దరఖాస్తు చేయవచ్చును. గ్రామ/వార్డు సచివాలయం ద్వారా కూడా దరఖాస్తు Online లో పంపవచ్చును. వచ్చిన దరఖాస్తులలో పై నిబంధనల మేరకు, 10వ తరగతి పరీక్షలో వచ్చిన మార్కులు ఆధారంగా ఎంపిక జరుగును.

## ఆరోగ్యానికి హానికరమయిన శభ్రంచేయు వృత్తులలో ఉన్నవారి పిల్లలకు ప్రీ-మెట్రిక్ ఉపకారవేతనములు

**నేపథ్యం:** అత్యంత అణగారిన వర్గాలు అనాదిగా కొన్ని ఆరోగ్య హానికర శుభ్రపరచు వృత్తులలో పనిచేయుచున్నారు. అటువంటి వారి పిల్లలకు బడిలో చదువుకునేందుకు ఆర్థిక సహాయం చేయటం ఈ పథకం లక్ష్యం.

**అర్హతలు:** మతం, కులంతో సంబంధం లేకుండా, క్రింద పేర్కొన్న వారి పిల్లలు 1 నుంచి 10వ తరగతి వరకు ఉపకార వేతనమునకు అర్హులు.

ఎ) 2013 మాన్యువల్ స్కావెంజర్ వృత్తి నిషేధ చట్టం క్రింద పేర్కొనబడిన మాన్యువల్ స్కావెంజర్‌లు

బి) పశువుల చర్మాలు వలిచే వారు (Tanners & Flayers)

సి) చెత్త ఏరేవారు (Rag-Pickers)

డి) 2013 మాన్యువల్ స్కావెంజర్ వృత్తి నిషేధ చట్టం క్రింద పేర్కొనబడిన ఆరోగ్యానికి హానికరమయిన శుభ్రంచేయు వృత్తులలో ఉన్నవారు.
సంబంధిత పంచాయతి/మున్సిపల్ అధికారి ధృవీకరణ సర్టిఫికేట్ అవసరం.

**ఆర్థిక సహాయం:**

| తరగతి | డేస్కాలర్ విద్యార్థి | హాస్టల్ విద్యార్థి |
|---|---|---|
| 1 నుండి 10వ | నెలకు రూ. 225/- (10 నెలలకు) | రూ. 700/- (10 నెలలకు) |

# విదేశీ విద్యా పథకం

**ఈ పథకం యొక్క లక్ష్యం :**

- నిరుపేద కుటుంబాలకు చెందిన ఎస్.సి., ఎస్.టి., బి.సి.,ఈ.బి.సి., మైనారిటీ, కాపు, బ్రాహ్మణ విద్యార్థులను విదేశాలలో ఉన్నత చదువులు చదివించి బంగారు భవిష్యత్తును ఇచ్చే లక్ష్యంతో ప్రభుత్వము ఈ పథకం ను అమలు చేస్తున్నది.

**అర్హత:**

- వార్షికాదాయము రూ. 6.00 లక్షల లోపు ఉన్న విద్యార్థులు ఈ పథకానికి అర్హులు

**ప్రభుత్వ సహాయం :**

- విదేశాలలో డిగ్రీ అనంతర మరియు ఇంజనీరింగ్, మెడిసిన్, పి.హెచ్.డి., పి.జి. డిప్లొమా మొదలైన ఉన్నత విద్యనభ్యసించ కోరు విద్యార్థులకు ప్రభుత్వం ఎస్.సి., ఎస్.టి., మైనారిటీ విద్యార్థులకు రూ.15 లక్షల రూపాయలు మరియు మిగిలిన వారికి రూ.10 లక్షల రూపాయలు ఆర్థిక సహాయం అందచేయబడుతుంది.
- అమెరికా సంయుక్త రాష్ట్రాలు, గ్రేట్ బ్రిటన్, ఆస్ట్రేలియా, కెనడా, సింగపూర్, జెర్మనీ, న్యూజిలాండ్, స్వీడన్, నెదర్లాండ్స్, ఫ్రాన్స్, డెన్మార్క్, రష్యా, ఫిలిప్పీన్స్, కజికిస్తాన్ మరియు చైనా వంటి 15 దేశాలలో (ఫిలిప్పీన్స్, కజికిస్తాన్ మరియు చైనా లలో కేవలం మెడిసిన్ కోర్సులకు మాత్రమే) గుర్తింపు పొందిన ప్రముఖ విశ్వవిద్యాలయాలలో కోర్స్ లను అధ్యయనం చేయుటకు ఈ పథకం వర్తించును.
- దీనితో పాటు ఒక వైపు విమాన చార్జీలు మరియు వీసా ఫీజు విద్యార్థికి చెల్లించబడును
- నిర్ణిత వడ్డీతో జాతీయ బ్యాంకుల ద్వారా 5 లక్షల రూపాయిల ఋణము లభించును.

**దరఖాస్తు చేయు విధానం :**

- ఈ పథకానికి ఈ-పాస్ వెబ్ సైట్ నందు దరఖాస్తు చేసుకొనవలెను.
- దరఖాస్తు చేసుకున్న విద్యార్థులను రాష్ట్ర స్థాయి ఎంపిక కమిటి ఇంటర్వ్యూ చేసి ఎంపిక చేస్తుంది.

## వై.ఎస్.ఆర్. విద్యోన్నతి

ఈ పథకం యొక్క లక్ష్యం :

- సివిల్ సర్వీసెస్ వంటి ఉన్నత స్థాయి పోటీ పరీక్షలకు సమీకృత శిక్షణ ఇచ్చే ఉద్దేశ్యంతో ఈ పథకాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది.

అర్హత :

- రూ. 6.00 లక్షల లోపు వార్షికాదాయము గల, పట్ట భద్రులైన ఎస్.సి., ఎస్.టి., బి.సి., ఈ.బి.సి., మైనారిటీ, కాపు, బ్రాహ్మణ విద్యార్థులకు ఈ పథకము వర్తించును.
- ఎంపికైన విద్యార్థులను భారత దేశంలోని ప్రతిష్టాత్మకమైన 19 కోచింగ్ సంస్థలకు పంపి యు.పి.ఎస్.సి. నిర్వహించు సివిల్ సర్వీస్ ప్రిలిమ్స్ మరియు మెయిన్స్ పరీక్షలకు 9 నెలల సమగ్ర శిక్షణ ఇప్పించ బడుతుంది.
- ఈ పథకానికి ఎంపికైన విద్యార్థులకు నెలకు రూ.10,000 / రూ.12,000/-లు స్టైఫండ్‌ను 9 నెలల పాటు చెల్లిస్తూ, పూర్తి కోచింగ్ ఫీజును ప్రభుత్వం చెల్లిస్తుంది.

దరఖాస్తు చేయు విధానం :

- ఈ పథకానికి **https://jnanabhumi.ap.gov.in** వెబ్ సైట్ నందు నోటిఫికేషన్ వెలువడినప్పుడు దరఖాస్తు చేసుకొనవలెను.

విద్యార్థుల ఎంపిక విధానం :

- విద్యార్థుల ఎంపిక ప్రవేశ పరీక్ష ద్వారా జరుగును.

# స్టడీ సర్కిల్స్

**నేపథ్యం:** ఆంధ్రప్రదేశ్ లో వెనుకబడిన తరగతుల యువతీ యువకులు పోటీ పరీక్షల ద్వారా ఉద్యోగాలు సాధించుటకు ప్రతి జిల్లాకు ఒకటి చొప్పున స్టడీ సర్కిల్ ఏర్పాటు చేసినారు. షెడ్యూల్ట్ కులముల కొరకు కూడా ప్రతి జిల్లాలో అంబేద్కల్ స్టడీ సర్కిల్ ఏర్పాటు త్వరలో చేయబడును. ప్రస్తుతం విశాఖపట్నం, విజయవాడ, తిరుపతిలో అంబేద్కర్ స్టడీ సర్కిల్స్ వున్నవి. మైనారిటీల కొరకు విశాఖపట్నం, గుంటూరు, కర్నూలులో ప్రత్యేక స్టడీ సర్కిల్స్ వున్నాయి. షెడ్యూల్డ్ తెగల కొరకు యూత్ శిక్షణ కేంద్రాలు నిర్వహించబడుచున్నాయి.

**ప్రయోజనం:** నిరుద్యోగ యువతీ యువకులు స్టడీ సర్కిల్ ద్వారా శిక్షణ పొంది తద్వారా పోటీ పరీక్షలలో పాల్గొని ఉద్యోగావకాశాలు పొందడం.

**దరఖాస్తు విధానం:** ఎ.పి.పి.ఎస్.సి. గ్రూప్ సర్వీసెస్, బ్యాంకింగ్, రైల్వేస్ వంటి పోటీ పరీక్షలకు దరఖాస్తు చేసకొని ఆ హాల్ టిక్కెట్స్‌తో సంబంధిత జిల్లాలోని స్టడీ సర్కిల్ వారికి దరఖాస్తు చేసుకోవాలి.

**ఆర్థిక లబ్ధి:** 2 నుండి 3 నెలల పాటు ఉచిత కోచింగ్ ఇస్తారు. బుక్స్ కొనుగోలు కొరకు స్టైఫండ్ కూడా ఇవ్వడం జరుగుతుంది.

# జగ్జీవన్ జ్యోతి పథకం (200 యూనిట్ల వరకు ఉచిత విద్యుత్)

**ఈ పథకం యొక్క లక్ష్యం:**

నెలకు 200 యూనిట్ల వరకు వినియోగించు షెడ్యూల్డ్ కులముల, షెడ్యూల్డ్ తెగల కుటుంబాలకు ప్రభుత్వమే విద్యుత్ ఛార్జీలు చెల్లించును. 24-07-2019 నుండి "జగ్జీవన్ జ్యోతి" పథకం ద్వారా మొదటగా ఉన్న నెలకు 100 యూనిట్ల ఉచిత విద్యుత్ పరిమితిని నెలకు 200 యూనిట్ల వరకు లోబడి పెంచబడింది.

**ఉదా:** 200 యూనిట్ల లోపు వినియోగించే వినియోగదారులు విద్యుత్ ఛార్జీలు చెల్లించనవసరం లేదు. 200 యూనిట్ల కంటే ఎక్కువ విద్యుత్ వినియోగించేవారు పూర్తి యూనిట్లకు విద్యుత్ ఛార్జీలు చెల్లించవలసి ఉంటుంది. వీరు ఉచిత విద్యుత్ పరిధిలోకిరారు.

**దరఖాస్తు చేయు విధానం:**

- ఈ పథకం ద్వారా లబ్ధి పొందుటకు వినియోగదారులు ఎటువంటి దరఖాస్తు ను చేయవలసిన అవసరం లేదు. ప్రభుత్వమే విద్యుత్ పంపిణి సంస్థల నుండి వివరాలను తెప్పించుకొని, వినియోగదారుల తరుపున విద్యుత్ చార్జీలను చెల్లిస్తుంది.

# భీమా పథకములు

YSR భీమా పేదవారికి రాష్ట్ర ప్రభుత్వ అందిస్తున్న ప్రధాన భీమా పథకం దానికి అదనంగా కేంద్ర ప్రభుత్వం/రాష్ట్ర ప్రభుత్వం అందిస్తున్న ఇతర భీమా పెన్షన్ పథకాల వివిరాలు క్రింద ఇవ్వబడినవి.

1. ప్రవాసాంధ్ర భరోసా భీమా పథకం:

| | |
|---|---|
| నేపథ్యం | : రాష్ట్రానికి చెంది ఇతర దేశాలలో ఉద్యోగాలు చేసేవారికి, చదువుకునే వారి ప్రోత్సాహం కొరకు ఈ భీమా పథకం |
| ప్రయోజనం | : ఉద్యోగులు రూ. 180/-లు, విద్యార్థుల రూ. 75/- లు ప్రీమియం చెల్లించాలి. ఇందులో నమోదైన వారు ప్రమాదవశాత్తు మరణించినా, శాశ్వత అంగవైకల్యానికి గురైన రూ. 10 లక్షలు పరిహారంగా చెల్లస్తారు. |
| అర్హతలు | : ప్రవాసాంధ్రులందరూ అర్హులు. |
| దరఖాస్తు | : రాష్ట్ర మానవ వనరుల శాఖ వారి ఆన్‌లైన్ దరఖాస్తు విధానం. |
| నిధుల లభ్యత | : రాష్ట్ర ప్రభత్వ బడ్జెట్ కేటాయింపు |

2. ప్రధాన మంత్రి జీవనజ్యోతి భీమా యోజన:

| | | |
|---|---|---|
| నేపథ్యం | : | 18 నుంచి 50 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్నవారు ఏ కారణంతోనైనా మరణిస్తే ఆ కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకునే భీమా సదుపాయం. |
| ప్రయోజనం | : | బ్యాంకు అకౌంట్ కలిగి, 18 నుంచి 50 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్నవారు ఏ కారణంతోనైనా మరణిస్తే రూ. 2 లక్షల భీమా మొత్తం బాధిత కుటుంబానికి చెల్లించడం జరుగుతుంది. ఈ పథకం క్రింద ప్రీమియంగా లబ్ధిదారుని ఖతా నుండి సంవత్సరానికి రూ.330/- ఖతాదారుని సమ్మతి మేరకు ఆటోమేటిక్‌గా తగ్గించడం |

## 2. ప్రధాన మంత్రి జీవనజ్యోతి భీమా యోజన:

| | |
|---|---|
| నేపథ్యం | : 18 నుంచి 50 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్నవారు ఏ కారణంతోనైనా మరణిస్తే ఆ కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకునే భీమా సదుపాయం. |
| ప్రయోజనం | : బ్యాంకు అకౌంట్ కలిగి, 18 నుంచి 50 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్నవారు ఏ కారణంతోనైనా మరణిస్తే రూ. 2 లక్షల భీమా మొత్తం బాధిత కుటుంబానికి చెల్లించడం జరుగుతుంది. ఈ పథకం క్రింద ప్రీమియంగా లబ్ధిదారుని ఖతా నుండి సంవత్సరానికి రూ.330/- ఖతాదారుని సమ్మతి మేరకు ఆటోమేటిక్‌గా తగ్గించడం జరుగుతుంది. అదేవిధంగా రెన్యువల్ కోసం లబ్ధిదారుడు ప్రతి సంవత్సరం ఈ పథకం కొరకు బ్యాంకు వారికి ఆప్షన్ ఇవ్వవలసి ఉంటుంది. |
| అర్హతలు | : బ్యాంకులో పొదుపు ఖాతా ఉండి, 18 నుండి 50 సంవత్సరరాల మధ్య వయస్సు ఉన్నవారందరూ, పేదరికంతో సంబంధంలేకుండా అందరూ ఈ పథకానికి అర్హులు. |
| దరఖాస్తు | : అన్ని జాతీయ బ్యాంకుల ద్వారా |
| నిధుల లభ్యత | : కేంద్ర ప్రభుత్వ బడ్జెట్ కేటాయింపు |

## భీమా పథకములు

### 3. ప్రధానమంత్రి సురక్షా భీమా యోజన

నేపథ్యం : తక్కువ ప్రీమియంతో ప్రమాదభీమా కల్పించడం.

ప్రయోజనం : 18 నుండి 70 సంవత్సరాల మధ్య వయస్సు గలవారందరూ బ్యాంక్ అకౌంట్ కలిగి ఉండాలి. ప్రీమియంగా సంవత్సరమునకు 12 రూపాయలు ఖతాదారుని సమ్మతి మేరకు తన బ్యాంక్ అకౌంట్ నుండి ఆటోమేటిక్‌గా జూన్ 1వ తేదీన లేదా అంతకుముందు తగ్గించడం జరుగుతుంది. అదేవిధంగా రిస్క్ కవరేజి కోసం లబ్ధిదారుడు ప్రతి సంవత్సరం ఈ పథకం కొరకు బ్యాంకు వారికి ఆప్షన్ ఇవ్వవలసి ఉంటుంది.

ఎ) ప్రమాదవశాత్తు మరణిస్తే రూ. 2,00,000/-లు

బి) ప్రమాదంలో పూర్తి అంగవైకల్యం సంభవిస్తే రూ. 2,00,000/-లు

అర్హతలు : భారతీయుడై 18 నుండి 70 సంవత్సరాల లోపు వయస్సు కలవారు.

దరఖాస్తు : జాతీయ బ్యాంకుల ద్వారా

నిధుల లభ్యత : కేంద్ర ప్రభత్వ బడ్జెట్ కేటాయింపు

## 4. అటల్ పెన్షన్ యోజన

| | |
|---|---|
| నేపథ్యం | : బ్యాంక్ అకౌంట్ కలిగి, అసంఘటిత రంగాలలో పనిచేస్తున్న పేద కార్మికులకు ఆదాయ భద్రతను కల్పించడం ద్వారా వృద్ధాప్యంలో జీవితాన్ని కొనసాగించడానికి కనీస పెన్షను అందించే పథకం. |
| ప్రయోజనం | : ఈ పథకం క్రింద లబ్ధిదారులకు నెలకు కనీసం రూ.1000/- లు నుండి రూ.5,000/- లు ఫించనుగా చెల్లించబడుతుంది. |
| అర్హతలు | : 18 ఏళ్ళ వయస్సు నుండి 40 సంవత్సరముల లోపు పేద కార్మికులు అసంఘటిత రంగానికి చెంది ఉండి బ్యాంక్ అకౌంట్ కలిగి ఉండాలి. లబ్ధిదారుడు ప్రతి సంవత్సరం ప్రతి నెల ఈ పథకం క్రింద చందా కట్టాలి. కేంద్ర ప్రభుత్వం కూడా సంవత్సరానికి రూ. 1000/- లేదా లబ్ధిదారుడు చెల్లించిన దానిలో 50% వరకు కడుతుంది. |
| దరఖాస్తు | : జాతీయ బ్యాంకుల ద్వారా |
| నిధుల లభ్యత | : కేంద్ర ప్రభత్వ బడ్జెట్ కేటాయింపు |

5. ప్రధానమంత్రి వయ వందన యోజన

60 సంవత్సరాలు పైబడిన సీనియర్ సిటిజన్‌లకు లబ్ధి చేకూరేలా ఈ పథకం క్రింద కనీసం రూ. 1,50,000/-ల నుండి రూ.15,00,000/-ల వరకు సింగిల్ ప్రీమియంగా చెల్లించినపుడు కనీస పెన్షన్ రూ.1000/- నుండి గరిష్ట పెన్షన్ రూ.10,000/- ల వరకు (ప్రతినెలా) అనగా ప్రీమియం మొత్తంపై కనీసం 8% సంవత్సరానికి ఫించనుగా చెల్లించబడుతుంది. ఈ పథకం నిర్వహణ భారతీయ జీవిత భీమా సంస్థలకు అప్పగించారు.

| | | |
|---|---|---|
| నేపథ్యం | : | భారతీయ జీవిత భీమా సంస్థ ద్వారా 60 సం.లు దాటిన సీనియర్ సిటిజన్ లబ్ధికొరకు అమలు చేయటం. |
| ప్రయోజనం | : | 60 సంత్సరాలు పైబడిన సీనియర్ సిటిజన్ ఈ పథకం క్రింద కనీసం రూ. 1,50,000/- ల నుండి రూ.15,00,000/-ల వరకు సింగిల్ ప్రీమియంగా చెల్లించినపుడు, కనీస పెన్షన్ రూ.1000/- నుండి గరిష్ట పెన్షన్ రూ.10,000/- ల వరకు (ప్రతినెలా) అనగా ప్రీమియం మొత్తంపై కనీసం 8% సంవత్సరానికి ఫించనుగా చెల్లించబడుతుంది. పాలసీ 10 సంవత్సరాల పాటు వుంటుంది. ఆ లోపు చనిపోతే, ప్రీమియం మొత్తాన్ని చెల్లిస్తారు. |
| అర్హతలు | : | 60 సంవత్సరాలు పైబడిన వారు |
| దరఖాస్తు | : | ఎల్.ఐ.సి. ద్వారా ఆన్‌లైన్ అప్లికేషన్ |
| నిధుల లభ్యత | : | కేంద్ర ప్రభత్వ బడ్జెట్ కేటాయింపు |

## SC/ST/BC అడ్వకేట్లకు ఆర్థిక సహాయం

ఈ పథకం క్రింద న్యాయ పట్టభద్రులకు కోర్టులలో న్యాయ పాలన తగు తర్ఫీదు ఇచేందుకు ప్రతిజిల్లాలో ప్రతి సంవత్సరం అర్హత కలిగిన ◌ాజ/◌ా◌ు/బీజ న్యాయశాస్త్ర పట్టభద్రులను ఎంపిక చేసి న్యాయ శాస్త్రంలో శిక్షణ ఇప్పించడం జరుగుతుంది. శిక్షణా కాల వ్యవధి మూడు సంవత్సరాలు ఎంపిక అయిన అభ్యర్ధులను జిల్లా కోర్టులలోని న్యాయ అధికారులకు అనగా ప్రభుత్వ ప్లీడరు, పబ్లిక్ ప్రాసిక్యూటర్లు, జిల్లా, అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్లకు అనుసంధానము చేస్తారు. సెలక్షను కమిటీ ద్వారా ఎంపికైన అభ్యర్ధులకు నెలకు రూ. 1,000/- లు చొప్పున స్టైఫండు, మూడు సంవత్సరముల వరకు ప్రవేశ రుసుము ఒక్కొక్కరికి రూ. 585/- లా పుస్తకములు, ఫర్నీచరు కొనుగోలు నిమిత్తము కోర్సు మొత్తానికి రూ. 6,000/- లు చెల్లించడం జరుగుతుంది.

## వైఎస్ఆర్ చేయూత

45 సంవత్సరాలు నిండిన ప్రతి పేద బి.సి, ఎస్సీ, ఎస్టీ, మైనారిటీ మహిళకు ఈ పథకం ద్వారా 2020 - 21 నుండి నాలుగేళ్ళలో రూ. 75000/- దశల వారిగా ఆయా కార్పోరేషన్‌ల ద్వారా ఉచితంగా ఆర్థిక సహాయం రాష్ట్ర ప్రభుత్వం ద్వారా నేరుగా మహిళ బ్యాంక్ ఖాతాకు అందచేయబడుతుంది. దీనిపై త్వరలోనే ఆదేశములు, మార్గదర్శకాలు జారీ కానున్నాయి.

# వైఎస్ఆర్ చేయూత

## రజకులకు, నాయీబ్రాహ్మణులు, టైలర్లకు ఆర్థిక సహాయం

లక్ష్యం:

- పేద రజకులకు, నాయీబ్రాహ్మణులు మరియు టైలర్లు (కులముతో నిమిత్తము లేకుండా) ఎవరైతే వారి వృత్తి మీద జీవనోపాధి కొనసాగిస్తున్నారో, వారి ఆర్థిక అభివృద్ధికై రాష్ట్ర ప్రభుత్వము సంవత్సరానికి పది వేల రూపాయలు ఆర్థిక సహాయం చేస్తుంది. అయితే, ఆ వృత్తి చేయువారు షాపు కలిగి ఉండాలి. దీని కొరకు వెనుకబడిన తరగతుల శాఖ జి.ఓ.ఎమ్.ఎస్.నెం.59, తేది: 25-07-2019 న విడుదల చేసింది.

అర్హతలు:

ఎ) వయస్సు 21 సంవత్సరముల నుండి 60 సంవత్సరముల మధ్య వయస్సు కలవారై ఉండవలెను.

బి) కుటుంబ ఆదాయము నెలకు గ్రామీణ ప్రాంతాములవారైతే రూ. 10,000/- లకు లోబడి మరియు పట్టణ ప్రాంతములవారైతే రూ. 12,000/- లకు లోబడి ఉండవలెను.

సి) ప్రభుత్వ ఉద్యోగులు, ప్రభుత్వము నుండి పెన్షన్ పొందువారు మరియు ఆదాయపు పన్ను చెల్లించువారు అనర్హులు.

డి) వృత్తి చేయు వారు షాపు గల వారై ఉండవలెను.

ఇ) ఆ కుటుంబములోని వారికెవరికైనా వ్యవసాయ భూమి ఉంటే అవి మాగాణి భూమి అయితే 3 ఎకరముల లోపు లేదా మెట్ట భూమి అయితే 9 ఎకరముల లోపు లేదా మాగాణి మరియు మెట్ట భూమి మొత్తం కలిపి 9 ఎకరముల లోపు ఉన్న వారు మాత్రమే అర్హులు.

ఎఫ్) ఆ కుటుంబమునకు నివాస పట్టణ ప్రాంతాములో సొంత నివాస గృహము 750 చదరపు అడుగులకు లోబడి ఉండవలెను.

జి) షాపు రిజిస్ట్రేషన్ సర్టిఫికేటు ఉండవలెను.

ఎచ్) టైలరింగ్ వృత్తి చేయుచున్న అన్ని కులముల వారు ఈ పథకము క్రింద అర్హులు.

## సాంఘిక సంక్షేమ శాఖ – సామాజిక న్యాయం – చట్టాలు

1. **SC/ST** లపై అత్యాచార నిరోధక చట్టం 1989 అమలు:

SC/ST కులమునకు చెందిన వారిపై SC/ST లు కాని వారు ఏవరైనా భౌతికంగా సామాజికంగా, ఆర్థిక పరమైన అత్యాచారాలకు పాల్పడితే వారు భారత పార్లమెంట్ ద్వారా ఆమోదించబడిన SC/ST అత్యాచార నిరోధక చట్టం 1989 క్రింద శిక్షార్హులవుతారు.సదరు అత్యాచార బాధితులైన SC/ST లకు కొంత నగదు పరిహారాన్ని (రూ.85000/-నుండి 8,25,000/-వరకు) చెల్లించడముతో పాటు ఇతర సదుపాయాలను కల్పించడం జరుగుతుంది.

ఈ కేసుల విచారణ శీఘ్రముగా జరుగుటకు గానూరాష్ట్ర ప్రభుత్వముఒక్కొక్క జిల్లాకు ఒక ప్రత్యేక సెషన్సు న్యాయస్థానమును మరియు ఈ న్యాయస్థానములోని కేసులను నడుపుట కొరకు ఒక ప్రత్యేక పబ్లికు ప్రాసిక్యూటరును ఈ చట్టము క్రింద ఏర్పాటు చేయడమైనది

SC/ST లు కాని వారి చేత భాదించబడిన SC/ST వారు వారిపై దాడి జరిగిన ప్రదేశమునకు చెందిన పోలీసు స్టేషన్ నందు రిపోర్టు చేసి సదరు విషయమును సంభందిత మండల రెవెన్యు అధికారి లేదా రెవెన్యు డివిజనల్ అధికారి వారికి తెలియ పరచవలయును.

పోలీసు మరియు రెవెన్యు అధికారులు బాధించబడిన SC/ST తగిన రక్షణ కల్పించి సదరు విషయాని జిల్లా కలెక్టరు గారికి తెలియపరుస్తారు. జిల్లా కలెక్టరు గారు ప్రభుత్వ నిర్దేశముల ప్రకారము భాదితులకు ఆర్థిక, న్యాయ మరియు ఇతర సహకారాలను మంజూరు చేస్తారు.

కేంద్ర ప్రభుత్వము 2015 సం.లో ఈ చట్టమునకు కొన్ని సవరణలను చేస్తూ బాదితులకు చెల్లించే పరిహారములను పెంచడము జరిగింది. తదనుగునముగా ఆం.ప్ర. ప్రభుత్వము, సాంఘిక సంక్షేమ శాఖ, జి.ఓ. యం.ఎస్ సం.95. తేది.29-08-2016 ద్వారా బాదితులకు చెల్లించే పరిహారములను పెంచడము జరిగింది. వాటి వివరములు క్రింద తెలపడమైనది

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 1 | Putting any inedible or obnoxious substance [Section 3(1)(a) of the Act] | One lakh Rupees to the victim. Payment to then victim be made as follows:<br>(i) 10% at First Information Report (FIR) stage for serial numbers (2) and (3) and 25% at FIR stage for serial numbers (1), (4) and (5);<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 40% when the accused are convicted by the lower court for serial numbers (2) and (3) and likewise 25% for serial numbers (1), (4) and (5). |
| 2 | Dumping excreta, sewage, carcasses or any other obnoxious substance {Section 3(1)(b) of the Act] | |
| 3 | Dumping excreta, waste matter, carcasses with intent to cause injury, insult or annoyance [Section 3(1)(c) of the Act] | |
| 4 | Garlanding with footwear or parading naked or semi-naked [Section 3(1)(d) of the Act] | |
| 5 | Forcibly committing acts such as removing clothes, fordable tonsuring of head, removing moustaches, painting face or body [Section 3(1)(e) of the Act] | |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 6 | Wrongful occupation or cultivation of land [Section 3(1)(f) of the Act] | One lakh Rupees to the victim. The land or premises or water supply or irrigation facility shall be restored where necessary at Government cost by the concerned State Government or Union territory Administration. Payment to the victim be made as follows:<br>(i) 25%. at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 7 | Wrongful dispossession of land or premises or interfering with the rights, including forest rights. [Section 3(1)(g) of the Act] | |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 8 | Begar or other forms of forced or bonded labour [Section 3(1)(h) of the Act] | One lakh Rupees to the victim. Payment to be made as follows:<br><br>(i) Payment of 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 9 | Compelling to dispose or carry human or animal carcasses, or to dig graves {Section 3(1)(i) of the Act} | |
| 10 | Making a member of the Scheduled Castes or the Scheduled Tribes to do manual scavenging or employing him for such purpose [Section 3(1)(j) of the Act] | |
| 11 | Performing, or promoting dedication of a Scheduled Caste or a Scheduled Tribe woman as a devadasi [Section 3(1)(k) of the Act] | |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 12 | Prevention from voting, filing nomination [Section 3(1)(I) of the Act] | Eighty-five thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 13 | Forcing, intimidating or obstructing a holder of office of Panchayat or Municipality from performing duties [Section3(1)(m)of the Act] | |
| 14 | After poll violence and imposition of social and economic boycott [Section 3(1)(n) of the Act] | |
| 15 | Committing any offence under this Act for having voted or not having voted for a particular candidate [Section 3(1)(o) of the Act] | |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 16 | Instituting false, malicious or vexatious legal proceedings [Section3(1)(p) of the Act] | Eighty-five thousand Rupees to the victim or reimbursement of actual legal expenses and damages, whichever is less. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 17 | Giving false and frivolous information to public servant [Section 3(1)(q) of the Act] | One lakh Rupees to the victim or reimbursement of actual legal expenses and damages, whichever is less. Payment to be made as follows:<br>(I) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 18 | Intentional insult or intimidation to humiliate in any place within public view [Section 3(1)(r) of the Act] | One lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 19 | Abusing by caste name in any place within public view [Section 3(1)(s) of the | |
| 20 | Destroying, damaging or defiling any object held sacred or in high esteem [Section 3(1)(t} of the Act] | |
| 21 | Promoting feelings of enmity, hatred or ill-will [Section 3(1)(V) of the Act] | |

| S. No | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 23 | Intentionally touching a Scheduled Caste or a Scheduled Tribe woman without consent, using acts or gestures, as an act of sexual nature,<br>[Section 3(1)(w) of the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 24 | Son 326B of the Indian Penal Code (45 of 1860)- Voluntarily throwing or attempting to throw acid.<br>[Section 3(2)(va) read with schedule to the act) | (a) Eight lakh and twenty-five thousand Rupees to the victim with burns exceeding and 2% and above burns on face or in case of functional impairment of eye, ear, nose and mouth and or burn injury on body exceeding 30%<br>(b) four lakh and fifteen thousand Rupees to the victim with burns between 10% to 30% on the body;<br>(c) eighty-five thousand Rupees to the victim with burns less than 10% on the body other than on face. In addition, the State Government or Union territory Administration shall take full responsibility for the treatment of the victim of acid attack. The payment in terms of items (a) to (c) are to be made as follows:<br>(I) 50% at First Information Report (FIR) stage;<br>(ii) 50% after receipt of medical report. |

| S. No | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 25 | Section 354 of the Indian Penal Code (45 of 1860) -- Assault or criminal force to woman with intent to outrage her modesty. [Section 3(2) (va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(I) 50% at First Information Report (FIR) stage;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% on conclusion of trial by the lower court. |
| 26 | Section 354A of the Indian Penal Code (45 of 1860)--Sexual harassment and punishment for sexual harassment. [Section 32) (va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% at First Information Report (FIR) stage;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% on conclusion of trial by the lower court. |
| 27 | Section 354 B of the Indian Penal Code (45 of 1860)— Assault or use of criminal force to woman with intent to disrobe [ Section 3(2)(va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% at First Information Report (FIR) stage;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% on conclusion of trial by the lower court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 28 | Section 354 C of the Indian Penal Code (45 of 1860)— 'voyeurism. [Section 3(2)(va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(I) 10% at First Information Report (FIR) stage<br>(ii) 50% when the charge sheet is sent to the court.<br>(iii) 40% when the accused are convicted by the lower court. |
| 29 | Section 354 D of the Indian Penal Code (45 of 1860) — Stalking. [Section 3(2)(va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 10% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 40% when the accused are convicted by the lower court. |
| 30 | Section 376B of the Indian Penal Code (45 of 1860)— Sexual intercourse by husband upon his wife during separation. [Section 3(2)(va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follow,<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 31 | Section 376C of the Indian Penal Code (45 of 1860) -- Sexual intercourse by a person in authority. [Section 3(2)(va) read with Schedule to the Act] | Four lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% on conclusion of trial by the lower court. |
| 32 | Section 509 of the Indian Penal Code (45 of 1860)- Word, gesture or act intended to insult the modesty of a woman. Section 3(2)(va) read with Schedule to the Act] | Two lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 33 | Fouling or corrupting of water [Section 3(1)(x)of the Act] | Full cost of restoration of normal facility, including cleaning when the water is fouled, to be borne by the concerned State Government or Union territory Administration. In addition, an amount of eight lakh twenty-five thousand Rupees shall be deposited with the District Magistrate for creating community assets of the nature to be decided by the District Authority in consultation with the Local Body. |
| 34 | Denial of customary right of passage to a place of public resort or obstruction from using or accessing public resort [Section 3(1)(y) of the Act] | Four lakh twenty-five thousand Rupees to the victim and cost of restoration of right of passage by the concerned State Government or Union territory Administration. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| S. No | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 35 | Forcing of causing to leave house, village, residence desert place of residence [Section 3(1)(z) of the Act] | Restoration of the site or right to stay in house, village or other place of residence by the concerned State Government or Union territory Administration and relief of one lakh Rupees to the victim and reconstruction of the house at Government cost, if destroyed. Payment to be made as follows:<br>(I) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| S.N | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 36 | Obstructing or preventing a member of a Scheduled Caste or a Scheduled Tribe in any manner with regard to—<br>(A) using common property resources of an area, or burial or cremation ground equally with others or using any river, stream, spring, well, tank, cistern, water-tap or other watering place, or any bathing ghat, any public conveyance, any road, or passage [Section 3(1)(za)(A) of the Act]<br>(B) mounting or riding bicycles or motor cycles or wearing footwear or new clothes in public places or taking out wedding procession, or mounting a horse or any other vehicle during wedding processions [Section 3(1)(za)(B) of the Act] | (A): Restoration of the right using common property resources of an area, or burial or cremation ground equally with others or using any river, stream, spring, well, tank, cistern, water-tap or other watering place, or any bathing ghat, any public conveyance, any road, or passage equally with others, by the concerned State Government or Union Territory Administration and relief of one lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| S.No | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 36 | (C) entering any place of worship which is open to the public or other persons professing the same religion or taking part in, or taking out, any religious, so or cultural processions including jatras [Section 3(1)(za)(C) of the Act]<br>(D) entering any educational institution, hospital, dispensary, primary health center, shop or place of public entertainment or any other public place or using any utensils or articles meant for public use in any place open to the any public use in any place open to the any public[Section 3(1)(za)(D) of the Act}<br>(E) practicing any profession or the carrying on of any occupation, trade or business or employment in any job which other members of the public, or any section thereof, have a right to use or have access to [Section 3(1)(za)(E) of the Act] | (B): Restoration of the right of mounting or riding bicycles or motor cycles or wearing footwear or new clothes in public places or taking out wedding procession, or mounting a horse or any other vehicle during wedding processions, equally with others by the concerned State Government or Union territory Administration and relief of one lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) Payment of 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court;<br>(C): Restoration of the right of entering any ace of worship which is open to the public or other persons professing the same religion or |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 37 | Causing physical harm or mental agony on the allegation of being a witch or practicing witchcraft or being a witch [Section 3(1)(zb) of the Act] | One lakh Rupees to the victim and also commensurate with the indignity, insult, injury and defamation suffered by the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 38 | Imposing or threatening a social or economic boycott. [Section 3(1)(zc) of the Act] | Restoration of provision of all economic and social services equally with other persons, by the concerned State Government or Union territory Administration and r3lief of one lakh Rupees to the victim. To be paid in full when charge sheet is sent to the lower court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 39 | Giving or fabricating false evidence [Section 3(2)(i) and (ii) of the Act] | Four lakh fifteen thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |
| 40 | Committing offences under the Indian Penal Code (45 of 1860) punishable with imprisonment for a term of ten years or more [Section 3(2) of the Act] | Four lakh Rupees to the victim and or his dependents. The amount would vary, if specifically, otherwise provided in this Schedule. Payment to be made as follows:<br><br>(I) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 41 | Committing offences under the Indian Penal Code (45 of 1860) specified in the Schedule to the Act punishable with such punishment as specified under the Indian Penal Code for such offences [Section 3(2)(va) read with the Scheduled to the Act) | Two lakh Rupees to the victim and or his dependents. The amount would vary if specifically, otherwise provided in this Schedule.<br>Payment to be made as follows:<br><br>(i) 25% at First Information Report (FIR) stage;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br>(iii) 25% when the accused are convicted by the lower court; |
| 42 | Victimisation at the hands or a public servant[ Section 3(2) (vii) of the Act] | Two lakh Rupees to the victim and or his dependents.<br>Payment to be made as follows: |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 43 | Disability. Guidelines for evaluation of various disabilities and procedure for certification as contained in the Ministry of Social Justice and Empowerment Notification No. 16-18/97-NI, dated the 1 June, 2001. A copy of the notification is at Annexure-II.<br>(a) 100 % incapacitation<br>(b) where incapacitation is less than 100 % but more than 50 %<br>(c) where incapacitation is less than 50 % | Eight lakh and twenty-five thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br><br>Four lakh and fifty thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 50% when the charge sheet is sent to the court;<br><br>Two lakh and fifty thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 50% when the charge sheet is sent to the court. |

| Sl. No. | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 44 | Rape or Gang rape.<br>(i) Rape[Section 375 of the Indian Penal Code(45 of 1860)]<br>(ii) Gang rape [Section 376D of the Indian Penal Code( 45 of 1860)] | Five lakh Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% on conclusion of trial by the lower court.<br>Eight lakh and twenty-five thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after medical examination and confirmatory medical report;<br>(ii) 25% when the charge sheet is sent to the court;<br>(iii) 25% on conclusion of trial by the lower court. |
| 45 | Murder or Death. | Eight lakh and twenty-five thousand Rupees to the victim. Payment to be made as follows:<br>(i) 50% after post mortem report;<br>(ii) 50% when the charge sheet is sent to the court. |

| S.No | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 46 | Additional relief to victims of murder, death, massacre, rape, gang rape, permanent incapacitation and dacoity. | In addition to relief amounts paid under above items, relief may be arranged within three months of date of atrocity as follows:-<br><br>(i) Basic Pension to the widow or other dependents of deceased persons belonging to a Scheduled Caste or a Scheduled Tribe amounting to five thousand Rupees per month, as applicable to a Government servant of the concerned State Government or Union territory Administration, with admissible dearness allowance and employment to one member of the family of the deceased, and provision of agricultural land, an house, if necessary by outright purchase;<br><br>(ii) Full cost of the education up to graduation level and maintenance of the children of the victims. Children may be admitted to Ashram schools or residential schools, fully funded by the Government;<br><br>(iii) Provision of utensils, rice, wheat, daIs, pulses, etc., for a period of three months. |

| S.No | Name of the offence | Minimum amount of relief |
|---|---|---|
| 47 | Complete destruction or burnt houses. | Brick or stone masonry house to be constructed or provided at Government cost where it has been burnt or destroyed." |

## అంతరానితనం, అత్యాచారాలు, పౌరహక్కులపై ప్రభుత్వ G.O లు (ఆదేశాలు)

1.) ప్రతివారం మండల బృందం గ్రామ సందర్శన:-

- G.O. Ms.No.105,, తేది:31-10-2001.
- వారంలో ఒక నిర్ణీత రోజున మండల బృందం ఒక గ్రామము సందర్శించవలెను.
- బృందంలో తహసీల్దారు, MPDO, Sub - Inspector of Police ఉంటారు.

ఏమి చేయాలి?

- గ్రామ దేవాలయంలోనికి SC లకు ప్రవేశం, గ్రామ నీటి వనరుల దగ్గర అవకాశం కల్పించటం, గ్రామ హోటల్‌లో రెండు గ్లాసుల పద్ధతి నిర్మూలన, Manual Scavenging, బాండెడ్ లేబర్ తదితర సామాజిక రుగ్మతలపై దృష్టి.
- ప్రతి గ్రామంలో అంటరానితనం పూర్తిగా నిర్మూలన జరిగేంతవరకు ఈ గ్రామ సందర్శనలు జరపాలి.

2) పౌరహక్కుల దినోత్సవం

- G.O. Ms.No.128, తేది:21-11-2001
- ప్రతి నెల 30వ తారీఖున జరపాలి. (ఫిబ్రవరి నెలలో 28న)
- తహసీల్దారు, మీణూ, సాంఘిక సంక్షేమ శాఖ, జుఅసశీషఎవఆ్‌శాఖ అధికారులు, ఇతర మండల అధికారులు పాల్గొనాలి.
- ఒక గ్రామంలో గ్రామ సభ జరపాలి.
- అంటరానితనం అమానుషాలపై ప్రజలను చైతన్యపరచి, అందరినీ సమానంగా చూడవలసిన ఆవశ్యకతను వివరించాలి.
- మొదటి మూడు వారాలలో జరిగిన గ్రామ సందర్శన వివరాలుపై సమీక్షించాలి.
- అ సామాజిక ఘర్షణలు ఏర్పడకుండా జాగ్రత్తలు తీసుకోవాలి.

3) అత్యాచారాలు జరిగే అవకాశం గల ప్రాంతాల గుర్తింపు

- G.O. Ms.No.107/108, తేది: 31-10-2001
- ఇది అత్యాచారాల నిరోధక ముందస్తు చర్య.
- అత్యాచారాలు జరిగే అవకాశం వున్న ప్రదేశాలను గుర్తించి, ఆ గ్రామాలలో అధికారులు తరుచుగా సందర్శించాలి.
- ఆ ప్రాంతాలలో శాంతి కమిటీలను ఏర్పరచాలి.
- RDO, తహసీల్దారు, MPDO లు శాంతి కమిటీ సమావేశాలు జరిపించి, శాంతి స్థాపనకు చర్యలు చేపట్టాలి.

## 2. ఆ.ప్ర.దేవదాసి/జోగిని వ్యవస్థ నిరోధక చట్టం 1988

పేద ప్రజల అవిద్య,అమాయకత్వము, అభద్రతల కారణంగా ఏర్పడిన ఒక సాంఘిక దురాచారము ఈ దేవదాసి/జోగిని/మాతమ్మ వ్యవస్థ. తమ కుటుంబానికి లేదా గ్రామానికి మేలు జరగాలనీ తమ సంతానములో ఒక ఆడపిల్లను గ్రామ దేవతకు అర్పించడము/గ్రామదేవతతో వివాహము జరిపించడము చేస్తారు. అప్పటినుండి ఆ అమ్మాయి గ్రామ సమిష్టి వ్యక్తిగా పరిగానిన్పబడుతుంది. ఆమె ఇతరుల మాదిరిగా వివాహము చేసుకొనడానికి వీలు లేదు. గ్రామ దేవత ఉత్సవాలలో మరియు గ్రామస్తుల ఇతర ఉత్సవాలలో నాట్యము చేయడము, గుడిని శుబ్రము చేయడము వీరి పని. గ్రామములో బిక్షాటన ద్వారా జీవిస్తారు. సాధారణంగా వీరు ప్రాయములో ఉన్నపుడు గ్రామములోని మోతుబరి / ఇతరుల సెక్సు కోరికలను తీర్చే సాదనముగా ఉపయోగా పదతారు. వయసు మళ్ళిన తరువాత వీరు చాలా దుర్భరమైన ఏ మాత్రం గౌరవం లేని జీవితాన్ని గడుపుతారు. ఈ సాంఘిక దురాచారాన్ని రూపుమాపుటకు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 1988 వ సంవత్సరములో ఈ చట్టాన్ని చేసింది, ఈ చట్టం ప్రకారం ఎవరైనా అమ్మాయిని ఆమె ఇష్టంతో గాని లేక ఇష్టం లేకుండా కాని దేవదాసి/జోగినిగా మార్చడం ఈ చట్టం క్రింద నేరం. అట్లు చేసిన వారు, ప్రోత్సాహించిన వారు, సహకరించిన వారు ఈ చట్టం క్రింద శిక్షార్హులు. దేవదాసి/జోగిని ఆవృత్తి నుండి బయటకు వచ్చిన వారికి ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్థిక సహకార సంస్థ ద్వారా ఆర్థిక సహాయము పునరావాసము కల్పించడము జరుగుతుంది మరియు వారి పిల్లలను సాంఘిక సంక్షేమ శాఖ గురుకుల పాటశాలలందు చేర్పించి చదివించడము జరుగుతుంది

ఎవరైనా అమ్మాయిని ఆమె ఇష్టంతో గాని లేక ఇష్టం లేకుండా కాని దేవదాసి/జోగినిగా చేస్తున్నట్లు లేదా చేయబోతున్నట్టు తెలిస్తే ఎవరైనా దగ్గరలోని పోలీసు స్టేషను నందుగానీ, మహిళా శిశు సంక్షేమ అధికారులకు గానీ సాంఘిక సంక్షేమ అధికారులకు తెలియపరిస్తే వారు తదుపరి చర్యలు తీసుకొంటారు.

దేవదాసి/జోగిని ఆవృత్తి నుండి బయటకు వచ్చిన వారు ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్థిక సహకార సంస్థ ద్వారా ఆర్థిక సహాయము పొందుటకు దరఖాస్తులను ఆన్ లైన్ లో OBMS ద్వారా సమర్పించవలయును. ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్థిక సహకార సంస్థ నిధుల లభ్యతను బట్టి వారికి ఆర్థిక సహాయము మజూరుచేస్తుంది.

## 3.మాన్యువల్ స్కావెంజర్ నిరోధక చట్టం 2013:

దేశంలోని పారిశుద్ధ్య కార్మికులకు గౌరవ ప్రదమైన జీవితాన్ని ఏర్పాటుచేసి వారితో చేయిస్తున్న అసహ్యకరమైన పనులనుండి వారిని రక్షించుటకు భారత ప్రభుత్వము అంతకుముందు ఇదేవిశయము పై ఉన్న చట్టాల స్థానములో 2013 వ సంవత్సరములో ఈ చట్టమును చేయడము జరిగింది.

ఈ చట్టము ప్రకారము వాటర్ సీల్ లేని లేదా ఆధునికంకాని పాయాఖానాలు (Insanitary Latrines) కట్టడము /నిర్వహించడం, వాటిని శుభ్రం చేయుటకు మనుష్యులను వినియోగించడం మరియు పూర్తిగా డికంపోజ్ చేయకుండా వదలిన మానవ మలాన్ని కలిగిన మురుగు కాలువలను అవసరమైన యంత్ర సామాగ్రి, రక్షక కవచములు మరియు ముందు జాగ్రత్తలు లేకుండా మనుష్యులతో శుభ్రము చేయించటం ఈ చట్టం క్రింద నేరము.

భూగర్భములోని మురుగు కాలువలు మరియు సెప్టిక్ ట్యాంకులను యంత్రములతో మాత్రమే శుబ్రము చేయించాలి. అత్యవసర పరిసితితులలో మనుష్యులను ఉపయోగించవలసివస్తే ఈ చట్టం క్రింద చేసిన నియమావళిలో తెలిపిన రక్షక కవచములు, అవసరమైన వైద్య సామాగ్రి, పనివారికి జీవిత భీమా, అవసరమైన గాలి-వెలుతురు మొదలుగునవి ఏర్పాటు చేసిన తరువాతనే వినియోగించాలి. మురుగు కాలువలు మరియు సెప్టిక్ ట్యాంకులను శుబ్రము చేస్తున్నపుడు ప్రమాద వశాత్తు ఎవరైనా పనివారు మరణించినట్లయితే వారి కుటుంబ సభ్యులకు రు.10.00 లక్షల పరిహారాన్ని చెల్లించడము జరుగుతుంది, మరియు వారిని సదరు పనికి మనుష్యులను ఉపయోగించిన సంస్థపై పోలీసు కేసు నమోదు చేయడము జరుగుతుంది.

గుర్తించబడిన మాన్యువల్ స్కావెంజర్లు మరియు పారిశుధ్య పనివారలకు జీవనోపాధికొరకు 40% నుండి 60% వరకు సబ్సిడీతో జాతీయ సఫాయి కర్మచారి అభివృద్ధి పథకము క్రింద వివిధ ఉపాది పథకములను ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్ధిక సహకార సంస్థ ఏర్పాటు చేస్తుంది. ఈ పథకముల క్రింద లబ్ది పొందదలచినవారు ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్ధిక సహకార సంస్థకు దరఖాస్తులను ఆన్ లైన్ లో OBMS ద్వారా సమర్పించవలయును. ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్ధిక సహకార సంస్థ నిధుల లభ్యతను బట్టి వారికి ఆర్ధిక సహాయము మజూరుచేస్తుంది.

## 4. వెట్టి చాకిరీ నిర్మూలన చట్టం 1976

భూస్వాములు వ్యాపారులు అమాయకులైన కొంత మందికి వారి అవసరాలకు కొంత ధనాన్ని అప్పుగా యిచ్చి దానికి బదులుగా వారి కుటుంబములోని అందరు లేదా కొందరు లేదా ఒకరిని సదరు భూస్వామి తన వద్ద సదరు అప్పు తీరే వరకు తన యిష్టమొచ్చిన పనికి వినియోగించుకొంటాడు. ఈ విదముగా పనిలో కుదిరిన వారికి ఏవిదమైన హక్కులు - సౌకర్యా - వేతనములు వుండవు.

అమాయక ప్రజల అసహాయత పై ఏర్పడిన ఈ నిరంకుశ విదానాన్ని రూపు మాపి వెట్టి చాకిరీ గురి అవుతున్న పేదలను రక్షించుటకు భారత ప్రభుత్వము 1976 లో ఈ చట్టమును చేసింది. ఈ చట్టము ఎఅమలులోనికి వచ్చిన తేది 09-02-1976 నాటి నుండి (i) బాండెడ్ లేబర్ / నిర్బంద కార్మిక విదానము / వెట్టి చాకిరీ రద్దు చేయబడింది మరియు బాండెడ్ లేబరర్స్ గా పనిచేస్తున్న వారందరూ సదరు బాండ్ల నుండి విడుదల అయినట్లే మరియు వారు వారి పాత యజమానికి ఎవిదముగాను బద్దులుగా వుండనవసరము లేదు. (ii) బాండెడ్ పనికోరకు ఎవరుకుడా ముందుగా సొమ్మును ఇవ్వరాదు నిర్బందముగా ఎవరిని పనిలో పెట్టుకో నరాదు. మరియు (iii) యజమానులు పనివారితో వ్రాయించుకొన్న బాండ్లు / అంగీకారపత్రములు అన్నీ రద్దు చేయబడినాయి. గుర్తించబడిన పెట్టి కార్మికులకు జీవనోపాధికొరకు 40% నుండి 60% వరకు సబ్సిడీతో వివిధ ఉపాది పథకములను ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్ధిక సహకార సంస్థ ఏర్పాటు చేస్తుంది. ఈ పథకముల క్రింద లబ్ది పొందదలచినవారు ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్ధిక సహకార సంస్థకు దరఖాస్తులను ఆన్ లైన్ లో OBMS ద్వారా సమర్పించవలయును. ఆంధ్ర ప్రదేశ్ షెడుల్డు కులముల ఆర్ధిక సహకార సంస్థ నిధుల లభ్యతను బట్టి వారికి ఆర్ధిక సహాయము మజూరుచేస్తుంది.

## 5. పేదలకు ఇళ్ళ స్థలముల ఏర్పాటు

స్వంత ఇల్లు గానీ ఇంటి స్థలము గానీ లేని పేదలకు స్వంత గృహములు నిర్మించుకొనుటకు అవసరమైన నివాసస్థలములను ఉచితముగా పంపిణీ చేయడము ప్రభుత్వ ప్రాధాన్యతా సంక్షేమ పతకములలో ఒకటిగా వున్నది. స్వంత ఇంటి స్థలములేని పేదలు నివసిస్తున్న గ్రామములో నివాసస్తలములకు అనువైన ప్రభుత్వ భూమి లభ్యముగా వుంటే అందులోగానీ లేకుంటే ప్రయివేటు భూములను ఖరీదు చేసి గానీ ఆగ్రామములోని పేదలందరికీ ఉచితముగా పంపిణీ చేయడము జరుగుతుంది. ఏదైనా గ్రామములో నివాస స్థలములకో రకు సేకరించిన భూమిలో 40% ఎస్సీలకు, 10% యస్టీలకు, 30% బీసీలకు 10% మైనారిటీలకు ఇతరులకు 10% వినియోగించవలయును. మరియు ఇంటి స్థలములను కూడా వలయ పద్ధతిలో అన్ని కులాలవారు కలిసి వుండేవిదముగా పంపిణీ చేయవలసి వుంటుంది. మరియు ఈ విదముగా పంపిణీ చేసిన ప్రాంతములో అవసరమైన రోడ్లు, త్రాగు నీరు, విద్యుత్తు, పార్కు మొ. మౌలిక వసతులు ఏర్పాటు చేసి ఆవాస యోగ్యముగా చేయడము జరుగుతుంది.

నివాస స్థలములకు అవసరమైన ప్రయివేటు భూమిని కొనుగోలుచేయుటకు అవసరమైన నిధులను సాంఘిక సంక్షేమ శాఖ ఏర్పాటు చేస్తుంది. స్వంత ఇల్లు గానీ ఇంటి స్థలము గానీ లేని పేదలను గుర్తించడము, అవసరమైన భూమిని గుర్తించడము, కొనుగోలుచేయడము మరియు పేదలకు పంపిణీ చేయడము రెవెన్యు శాఖ నిర్వహిస్తుంది.

నూతనముగా ఏర్పడిన ప్రభుత్వము స్వంత ఇల్లు గానీ ఇంటి స్థలము గానీ లేని పేదలందరినీ గుర్తించి రాబోయే రెండు సంవత్సరాలలో 25 లక్షల కుటుంబాలకు అవసరమైన నివాసస్థలములను ఏర్పాటుచేయడముతో ఉచితముగా గృహములను కుడా నిర్మించి ఇచ్చుటకు నిర్ణయించి పాటు ఉచితముగా పంపిణీ చేయడము స్వంత ఇల్లు గానీ ఇంటి స్థలము గానీ లేని పేదలు స్వంత గృహములు నిర్మించుకొనుటకు అవసరమైన నివాసస్థలములను ఉచితముగా పొందుటకు వారి గ్రామములోని రెవిన్యూ సహాయకుని / వారి మండల రెవిన్యూ అధికారిని సంప్రదించవలయును

## 6. స్మశానముల కొరకు స్థలముల ఏర్పాటు

స్మశానములకు సరయిన స్థలములు లేక పేద ప్రజలు పడుతున్న ఇబ్బందులను గమనించి ప్రభుత్వము, ఏదైనా ఆవాసప్రాంతమునకు అవసరమైన స్మశానభూమి అందుబాటులో లేకుంటే సదరు ఆవాస ప్రాంతమునకు దగ్గరలో అనువైన ప్రభుత్వ భూమి లభ్యముగా వుంటే అందులోగానీ లేకుంటే ప్రయివేటు భూములను ఖరీదు చేసి గానీ ఆగ్రామములోని పేదలందరికీ స్మశానము కొరకు అందుబాటులో ఉంచడము జరుగుతుంది. అవసరమైన ప్రయివేటు భూమిని కొనుగోలుచేయుటకు అవసరమైన నిధులను సాంఘిక సంక్షేమ శాఖ ఏర్పాటు చేస్తుంది. అవసరమైన భూమిని గుర్తించడము, కొనుగోలుచేసి స్మశానమునకు కేతాయించడము రెవెన్యు శాఖ నిర్వహిస్తుంది.

## 7. ఆం.ప్ర. షెడ్యూల్డ్ కులములు మరియు షెడ్యూల్డ్ తెగల కమీషన్

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర షెడ్యూల్డ్ కులములు మరియు షెడ్యూల్డ్ తెగల కమీషన్ చట్టం 2003 క్రింద రాష్ట్రములో షెడ్యూల్డ్ కులములు మరియు షెడ్యూల్డ్ తెగల కొరకు ఒక శాశ్వత కమీషన్ ను ఏర్పాటు చేయడమైనది. ఈ కమీషన్ రాష్ట్రములో షెడ్యూల్డ్ కులములు మరియు షెడ్యూల్డ్ తెగల వారికి రాజ్యాంగము మరియు వివిధ చట్టములు కల్పించిన హక్కు మరియు సౌకర్యములు అమలు చేయుటలో ప్రభుత్వ అధికారుల అలక్ష్యములు ఆరోపణలపైనా యస్సీ యస్టీలు వారికి కల్పించబడిన హక్కులను రాయితీలను పొందడములో ఇతరుల ద్వారా ఏర్పడే అవరోదముల విషయములపైన విచారణ జరిపి ప్రభుత్వ అధికారులకు తగు ఆదేశములను జారీ చేస్తుంది. మరియు సివిల్ రైట్స్ సంరక్షణ చట్టం 1955 మరియు యస్సీ ఎస్టీ ల పై అత్యాచారముల నిరోధక చట్టము 1989 లలో యస్సీలు యస్టీలకు కల్పించబడిన హక్కుల అమలుపైన సమీక్షలు నిర్వహించి ఈ చట్టములు సమర్ధవంతముగా అమలు జరుపుటకు ప్రభుత్వమునకు తగు సిపార్సులు చేస్తుంది. యస్సీలు యస్టీలు వారికి రాజ్యాంగము ద్వారా మరియు వివిధ చట్టముల ద్వారా దకలు పరచబడిన హక్కులను రక్షణలను పొందడములో ఏర్పడే అవరోదములపై భాదితులు ఎవరైనా సమర్పించిన విజ్ఞాపనపైన గానీ లేదా కమీషన్ వారి దృష్టికి వచ్చిన అంశముపై గానీ విచారణ జరిపే అధికారము ఈ కమీషన్ కలిగి వుంది.

# షెడ్యూల్డ్ కులముల కాంపోనెంట్ మరియు షెడ్యూల్డ్ తెగల కాంపోనెంట్

- షెడ్యూల్డ్ కులములు, షెడ్యూల్డ్ తెగల వారి త్వరితగతిన అభివృద్ధికి మరియు వారి అభ్యున్నతి సూచికలలోని అంతరములను పూరించుటకు ఎస్.సి. ఎస్.పి చట్టము మరియు టి.ఎస్.పి. చట్టము ఏర్పాటుచేయబడి ఆంధ్రప్రదేశ్ నందు అమలు పరచబడుచున్నది.
- వచ్చే పది సంవత్సరాలలో సమానత్వం సాధించాలనేది ప్రధాన లక్ష్యం. ఎస్.సి. ఎస్.పి మరియు టి.ఎస్.పి.క్రింద షెడ్యూల్డ్ కులముల, తెగల ఆర్థిక స్వావలంబనకు, సాంఘిక విద్యాభివృద్ధి సాధించుటకు వివిధ పథకములు వివిధ శాఖల ద్వారా అమలుచేయ బడుచున్నవి. రాష్ట్రంలో షెడ్యూల్డ్ కులముల మరియు తెగల జనాభా ప్రాతిపదికన నిధులు కేటాయింపు జరుగుచున్నది.

## షెడ్యూల్డ్ కులాల కాంపోనెంట్ పర్యవేక్షణకు శాసనాత్మక విభాగాలు

### ఎస్.సి, ఎస్.టిల అభివృద్ధికి రాష్ట్ర కౌన్సిల్:

జీ.ఓ.యం.యస్.నెం.10, ప్లానింగ్ డిపార్టుమెంటు, తేది: 22-02-2013 ప్రకారము గౌరవ ముఖ్యమంత్రి అధ్యక్షులుగా (సెక్షన్16(1) యాక్ట్ -1/2013) ఎస్.సి, ఎస్.టిల అభివృద్ధికి రాష్ట్ర కౌన్సిల్ ఏర్పాటు చేయబడింది.

### యస్సియస్పి నోడల్ ఏజన్సీ:

జీ.ఓ.యం.యస్.నెం.8, ప్లానింగ్ డిపార్టుమెంటు, తేది: 23-02-2013 ప్రకారము సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి అధ్యక్షులుగా (సెక్షన్18(1) యాక్ట్ -1/2013) యస్సియస్పి నోడల్ ఏజన్సీ ఏర్పాటు చేయబడింది.

## షెడ్యూల్డ్ కులముల కాంపోనెంట్ మరియు షెడ్యూల్డ్ తెగల కాంపోనెంట్

**యస్‌సియస్‌పి మరియు టి.యస్.పి.జిల్లా పర్యవేక్షణ కమిటీ:**

జీ.ఓ.యం.యస్.నెం.10, ప్లానింగ్ డిపార్టుమెంటు, తేది: 01-11-2013 ప్రకారము జిల్లా కలెక్టర్ అధ్యక్షులుగా సెక్షన్22(1) యాక్ట్ - 1/2013) యస్‌సియస్‌పి మరియు టి.యస్.పి.జిల్లా పర్యవేక్షణ కమిటీ ఏర్పాటు చేయబడింది.

షెడ్యూల్డ్ కులాల ప్రజలకు మరియు వారి ఆవాస ప్రాంతాలకు ప్రత్యక్ష, పరిమాణాత్మకమైన ప్రయోజనాలను కల్పించి వివిధ పథకాల అమలు నిమిత్తం మరియు ఇతరులకు మరియు షెడ్యూల్ట్ కులముల మధ్య అంతరాలను తగ్గించుటకు ఎస్.సి ఉప ప్రణాళిక 2019-20 సంత్సరానికి 46 డిపార్టుమెంట్లకు రూ.15000 కోట్లు బడ్జెట్ కేటాయించబడింది.

# డప్పు కళాకారులకు పెన్షన్ల పథకం

**లక్ష్యం :** షెడ్యూల్ కులములలోని డప్పు కళాకారులకు ఆర్థిక చేయూత మరియు డప్పు వాయింపు కళను ప్రోత్సహించడము

**అర్హతలు:**

1) కులము : షెడ్యూల్డు కులము, 2) వృత్తి : డప్పు వాయించడము (డప్పు కళాకారులు)
3) వయస్సు : 50 సం. పై బడి ఉండవలెను, 4) ఆర్థిక స్థితి: తెల్ల రేషన్ కార్డు కలిగి ఉండవలెను.
5) ఇతరములు: ఏ ఇతర పెన్షనును కలిగి ఉండరాదు.

**దరఖాస్తు చేయు విధానం:** మీ సేవా కేంద్రంలో ఆన్ లైన్ పోర్టల్ ద్వారా ధరఖాస్తు చేయవలెను.

**జతపరచవలసినపత్రములు:**

1) కుల ధృవీకరణ పత్రం (మీ సేవ ద్వారా జారీ చేయబడిన ఇంటి గ్రేటెట్ సర్టిఫికేట్), 2). డప్పు కళాకారునిగా స్వయం ధృవీకరణ పత్రం.

3) వయస్సు ధృవీకరణ కొరకు SSC సర్టిఫికేట్ లేదా ఆధార్ లోని వయస్సు. 4) తెల్ల రేషన్ కార్డు 5) ఆధార్ కార్డు

**ఎంపిక :**

మీ సేవా కేంద్రంలో రిజిస్టరు కాబడిన దరఖాస్తులను గ్రామీణ ప్రాంతమైతే సంబింధిత గ్రామ పంచాయితీ కార్యదర్శి గారు పట్టణ ప్రాంతమైతే ఆ ప్రాంత బిల్ కలెక్టరు గారు సదరు దరఖాస్తు దారులు నివసిస్తున్న ప్రాంతములో విచారన జరిపి దరఖాస్తుదారులు సమర్పించిన వివరములు సరియైనవి అని ధృవీకరించుకొన్న తరువాత సదరు దరఖాస్తులను గ్రామీణ ప్రాంతమైతే సంబింధిత మండల పరిషత్ అభివృద్ధి అధికారిగారికి పట్టణ ప్రాంతమైతే సంబంధిత మునిసిపల్ కమీషనర్ గారికి ఆన్ లైన్ లో పంపిస్తారు. వారు సదరు దరఖాస్తులను పరిశీలించి ఆమోదిస్తారు. ప్రభుత్వము వారు కొత్త పెన్షన్లను మంజూరు చేసినప్పుడు పైవిదముగా అమోదించబడిన దరఖాస్తుదారులకు గ్రామీణాభివృద్ధి శాఖ వారు పెన్షన్ ను వారి బ్యాంకు ఖాతాలకు జమ చేస్తారు

**చేయూత:** (1) నెలకు రూ.3000/- ల చొప్పున పెన్షను, (2) సుమారు రు.3500/- ల విలువ కలిగిన డప్పు, గజ్జలు, దుస్తులు.

## సాంప్రదాయ చర్మకారులకు పెన్షన్ల పథకం

**లక్ష్యం:** షెడ్యూల్ కులములలోని సాంప్రదాయ చర్మకారులకు ఆర్థిక చేయూత

**అర్హతలు:**

1) కులము: షెడ్యూల్డు కులము

2) వృత్తి: సాంప్రదాయ చర్మకారులు

3) వయస్సు: 40 సం. పై బడి ఉండవలెను

4) ఆర్థిక స్థితి: తెల్ల రేషన్ కార్డు కలిగి ఉండవలెను.

5) ఇతరములు: ఏ ఇతర పెన్షనును కలిగి ఉండరాదు.

**దరఖాస్తు చేయు విధానం:** మీ సేవా కేంద్రంలో ఆన్ లైన్ పోర్టల్ ద్వారా ధరఖాస్తు చేయవలెను.

**జతపరచవలసిన పత్రములు:**

1) కుల ధృవీకరణ పత్రం (మీ సేవ ద్వారా జారీ చేయబడిన ఇంటి గ్రేటెట్ సర్టిఫికేట్)

2) డప్పు కళాకారునిగా స్వయం ధృవీకరణ పత్రం.

3) వయస్సు ధృవీకరణ కొరకు SSC సర్టిఫికేట్ లేదా ఆధార్ లోని వయస్సు.

4) తెల్ల రేషన్ కార్డు 5) ఆధార్ కార్డు

# సాంప్రదాయ చర్మకారులకు పెన్షన్ల పథకం

**ఎంపిక :** మీ సేవా కేంద్రంలో రిజిస్టరు కాబడిన దరఖాస్తులను గ్రామీణ ప్రాంతమైతే సంబందిత గ్రామ పంచాయితీ కార్యదర్శి గారు పట్టణ ప్రాంతమైతే ఆ ప్రాంత బిల్ కలెక్టరు గారు సదరు దరఖాస్తు దారులు నివసిస్తున్న ప్రాంతములో విచారణ జరిపి దరఖాస్తుదారులు సమర్పించిన వివరములు సరియైనవి అని ధృవీకరించుకొన్న తరువాత సదరు దరఖాస్తులను గ్రామీణ ప్రాంతమైతే సంబందిత మండల పరిషత్ అభివృద్ధి అధికారిగారికి పట్టణ ప్రాంతమైతే సంబంధిత మునిసిపల్ కమీషనర్ గారికి ఆన్ లైన్ లో పంపిస్తారు. వారు సదరు దరఖాస్తులను పరిశీలించి ఆమోదిస్తారు. ప్రభుత్వము వారు కొత్త పెన్షన్లను మంజూరు చేసినప్పుడు పైవిదముగా అమోదించబడిన దద్దరఖాస్తుదారులకు గ్రామీణాబివృద్ది శాఖ వారు పెన్షన్ ను వారి బ్యాంకు ఖాతాలకు జమ చేస్తారు

చేయూత: నెలకు రూ. 2250/- ల చొప్పున పెన్షను

# విభిన్న ప్రతిభావంతుల, హిజ్రాలు మరియు వయోవృద్ధుల సంక్షేమ శాఖ

## విభిన్న ప్రతిభావంతులకు సంక్షేమ పథకాలు

ఎ) ఉపకార వేతనము

నేపథ్యం : రాష్ట్రంలోని 1వ తరగతి నుండి పి.హెచ్.డి., ఆ పై తరగతు వరకు చదువుతున్న విభిన్న ప్రతిభావంతు, హిజ్రా విద్యార్థుందరికీ వారి విద్యాప్రామాణాలు, జీవన ప్రామాణాు మెరుగుపరుచుట కొరకు వివిధ దశలో ఉపకారవేతనము అందించుట.

ప్రయోజనం :

1. **ప్రీ మెట్రిక్ ఉపకార వేతనము:**-1వ తరగతి నుండి 10వ తరగతి వరకు చదువుకొనుచున్న విభిన్న ప్రతిభావంతు, హిజ్రా విద్యార్థుకు సంవత్సరానికి ఈ ఉపకారవేతనము మంజూరు చేయబడుచున్నది:

| క్ర.సం. | తరగతి | ఉపకార వేతనము |
|---|---|---|
| 1 | I to V | 1000/- |
| 2 | VI to VIII | 1500/- |
| 3 | IX to X | 2250/- |

**అర్హతలు :** విభిన్న ప్రతిభావంతు, హిజ్రా కుటుంబ వార్షిక ఆదాయం రూ. 1,00 లోపు ఉండాలి.

**దరఖాస్తు విధానం:** విభిన్న ప్రతిభావంతు, హిజ్రాలు మరియు వయోవృద్ధు సంక్షేమ శాఖ వారి OBMMS ఆన్‌లైన్ ప్రక్రియ ద్వారా

9. సమాచార నిర్వహణ వ్యవస్థ (మేనేజ్ మెంట్ ఇన్ఫర్మేషన్ సిస్టమ్) ద్వారా పాఠశాల స్థాయి నుంచి సమాచారాన్ని సేకరించి, ఇతర భాగస్వాములకు అందించాలి.

10. మధ్యాహ్న భోజన పథకం పై అవగాహన స్థితిని నియమితానుసారం సమీక్షలు జరపాలి.

11. ఆహార ధాన్యాలను ఎలక్ట్రానిక్ పాయింట్ ఆఫ్ స్కేల్ (ఈ-పివోఎస్) సిస్టమ్ ద్వారా మాత్రమే సేకరించాలి. ఆహార ధాన్యాల కొరకు ఇండెంట్‌ని సకాలంలో ప్రధానోపాధ్యాయులు ఆన్‌లైన్‌లో నమోదు చేయాలి మరియు నిర్ధిష్ట కాల పట్టిక ప్రకారంగా ఆహార ధాన్యాలను చౌకధరల దుకాణాల (ఎఫ్‌పీ షాపు) నుంచి సేకరించాలి.

## ఆ) రికార్డుల నిర్వహణ

1. సరఫరాదారు నుంచి సరఫరా చేయబడ్డ ఆహార ధాన్యాలు, ముడిపదార్థాలు, గుడ్లు మరియు చిక్కిలు అందుకుని నమోదు చేసిన రికార్డులు.

2. మధ్యాహ్న భోజనం తయారీకి ఉపయోగించిన ముడి పదార్థాల వినియోగం యొక్క రికార్డులు.

3. పాఠశాల నమోదు, రోజువారీ హాజరు మరియు మధ్యాహ్న భోజనం తీసుకున్న విద్యార్థులకు సంబంధించిన రిజిస్టరులు.

4. దాతల నుంచి అందుకున్న విరాళాలు మరియు వాటి వినియోగం యొక్క రిజిస్టర్లు.

5. రుచి నమోదు పట్టిక, ఇందులో తల్లిదండ్రుల కమిటీ సభ్యులు, ప్రధానోపాధ్యాయులు/ ఉపాధ్యాయులు భోజనం రుచి చూసి, వారి అభిప్రాయాలను నమోదు చేస్తారు.

6. పాఠశాల తల్లిదండ్రుల కమిటీల సమావేశాలు మరియు దాని యొక్క తీర్మానాల రిజిస్టరు, తీర్మానాలపై తీసుకున్న చర్యలు నియతానుసారంగా రిజిస్టరులో అప్ డేట్ చేయవలెను.

7. తనిఖీ అధికారుల పరిశీలనను మరియు వారి పరిశీలనలపై తీసుకున్న చర్యలు మరియు పరిష్కార మార్గాల నమోదు యొక్క రిజిస్టరు.

## ఇ) వివిధ స్థాయి అధికారుల ద్వారా తనిఖీలు

1. జిల్లా విద్యాశాఖాధికారులు, డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసర్లు, సహాయ సంచాలకులు(ఎండీఎం), ఎంఈవోలు పాఠశాల లను తనిఖీ చేయాలి.

2. ఒక నెలలో వివిధ స్థాయి అధికారులు తనిఖీ చేయవలసిన/ సందర్శన చేయవలసిన పాఠశాలల సంఖ్య దిగువ పేర్కొన్నవిధంగా ఉంటుంది:

| | | | | |
|---|---|---|---|---|
| 3. | 1. | ప్రాంతీయ సంయుక్త సంచాలకులు పాఠశాల విద్య | - | 5 |
| 4. | 2. | జిల్లా విద్యా అధికారి | - | 7 |
| 5. | 3. | డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసర్ | - | 10 |
| 6. | 4. | సహాయ సంచాలకులు (మధ్యాహ్న భోజన పథకం) | - | 12 |
| 7. | 5. | మండల విద్యాశాఖాధికారి | - | 15 |

8. క్రమంగా షెడ్యూల్ తనిఖీలకు అదనంగా క్షేత్రస్థాయి అధికారులు ఎంఈవో/ డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసర్

స్కూలుకు ఆకస్మిక తనిఖీలు చేయాల్సి ఉంటుంది. అకస్మికంగా సందర్శనలు చేయవలసిన పాఠశాలలను రాష్ట్రస్థాయి నుంచి కంప్యూటర్ ద్వారా ఆటోమేటిక్‌గా జనరేట్ చేసిన పాఠశాలలను తనిఖీ అధికారులకు ఆన్‌లైన్ ద్వారా తెలియజేయబడుతుంది.

9. క్షేత్రస్థాయి అధికారులు సందర్శన/తనిఖీ తరువాత సిఫారసు చేయబడ్డ ప్రొఫార్మాలో /చెక్‌లిస్ట్ లో తనిఖీ నివేదికను నమోదు చేయాలి.

10. క్షేత్రస్థాయి అధికారుల సందర్శనల సమయంలో అనుసరించాల్సిన చెక్‌లిస్ట్ లేదా ప్రశ్నావళిఈ మార్గదర్శ కాలకు జత చేయబడింది.

11. వివిధ స్థాయిల ద్వారా మధ్యాహ్న భోజన కార్యక్రమాన్ని పర్యవేక్షించడం, స్కూళ్లను తనిఖీ చేయడం వల్ల కార్యక్రమం విజయవంతంగా అమలు చేయడానికి మరియు కార్యక్రమం యొక్క లక్ష్యాలను సాకారం చేయడానికి ఉపయోగపడుతుంది.

12. ప్రభుత్వం ద్వారా నిర్దేశించిన 4/5 అంచెల తనిఖీ వ్యవస్థ ప్రకారంగా తనిఖీలు నిర్వహించబడతాయి.

13. ప్రధానోపాధ్యాయులు మరియు తల్లిదండ్రుల కమిటీ సభ్యులు ప్రతిరోజు వంటగది, పదార్థాల నిల్వ గది, డైనింగ్ ఏరియా మరియు వాష్ బేషిన్ వంటి వాటిని ప్రతిరోజూ తనిఖీ చేయాలి మరియు మధ్యాహ్న భోజన పథకానికి సంబంధించిన వివరాలన్నీ రిజిస్టర్‌లను తనిఖీ చేయాలి మరియు ఎంట్రీలు చేయాలి.

14. సంక్షేమ మరియు విద్యా సహాయకులు/ వార్డు సంక్షేమ అభివృద్ధి కార్యదర్శి వారానికి కనీసం మూడు సార్లు పాఠశాలలను సందర్శించాలి మరియు కిచెన్ కమ్ స్టోర్, డైనింగ్ ఏరియా, వాష్ బేసిన్‌ని తనిఖీ చేయాలి మరియు పైన పేర్కొన్న రిజిస్టర్లలో తమ పరిశీలనలను నమోదు చేయాలి.

15. గ్రామ సంస్థ సభ్యులు/ మురికివాడల సమాఖ్య సభ్యులు వారి పరిధిలో ఉన్న పాఠశాలలను నెలలో రెండుసార్లు తనిఖీ చేసి వారి పరిశీలనలను మధ్యాహ్న భోజన పథక రిజిస్టరులో నమోదు చేయాలి.

16. గ్రామ సర్పంచ్‌లు, ఎంపిపిలు, జడ్ పిటిసిలు, వార్డు మెంబర్లు, మున్సిపల్ కార్పొరేటర్లు, మున్సిపల్ చైర్ పర్సన్లు, జిల్లా పరిషత్ చైర్ పర్సన్లు, గౌరవ ఎమ్మెల్యేలు, గౌరవ ఎమ్మెల్సీలు, గౌరవ మంత్రులు, గౌరవ పార్లమెంట్ సభ్యులు తదితర ప్రజా ప్రతినిధులకు ఈ కార్యక్రమం గురించి వివరించాలి మరియు వారు పాఠశాలను తనిఖీ చేసే విధంగా ప్రోత్సహించాల్సి ఉంటుంది. ఈ తనిఖీలు కార్యక్రమాన్ని విజయవంతంగా అమలు చేయడానికి దోహదపడుతుంది.

## తనిఖీ చేసే అధికారులు ఈ కింది అంశాలపై దృష్టి పెట్టాలి

- వంటగదిలో సదుపాయాలు, ఆహార పట్టిక మధ్యాహ్న భోజన పథకంలో వాడుతున్న ముడిపదార్థాల బరువు నిబంధనలు.
- గోదాము/ నిల్వగది యొక్క నిర్వహణ.
- హాజరు మరియు నిల్వ రిజిస్టర్ల నిర్వహణ.

- పాఠశాలల్లో ఆహార పదార్థాల మిగులు నిల్వ.
- వంటగది, ఆహార భద్రతా చర్యల పరిశీలన.
- ఉపయోగించే పదార్థాల మరియు కూరగాయల నాణ్యత.
- పిల్లలకు నాణ్యమైన మరియు ఖచ్చితమైన పరిమాణంలో భోజనం అందించబడుతుందా లేదా అని విద్యార్థులు, ఉపాధ్యాయుల నుండి అభిప్రాయ సేకరణ చేయాలి.
- కేంద్రీకృత వంటశాలల ద్వారా భోజనసరఫరా మరియు భోజనాన్ని అందించే సమయం.
- వివిధ స్థాయి అధికారులు మరియు వివిధ వ్యక్తుల తనిఖీల సమయంలో చేయవలసిన పరిశీలనలు కింద పేర్కొన్న ప్రొఫార్మాలో నింపవలెను.

| పాఠశాల సందర్శన ప్రొఫార్మా | | |
|---|---|---|
| 1 | స్కూలు U-DISE కోడ్ | |
| 2 | పాఠశాల పేరు | |
| 3 | తరగతులు | నుంచి-వరకు |
| 4 | హాజరుపట్టీల ప్రకారం పాఠశాల నందు మొత్తం విద్యార్థుల సంఖ్య | |
| 5 | మధ్యాహ్న భోజనం తీసుకున్న విద్యార్థుల సంఖ్య | |
| 6 | కిచెన్ కమ్ స్టోర్ లభ్యం అవుతున్నదా లేదా | |
| 7 | గ్యాస్ సిలిండర్/ వంటచెరకు/ ఇతరాలతో భోజనం తయారు | |

| | | |
|---|---|---|
| 8 | వంటను వంటగదిలో చేస్తున్నారా? బయట చేస్తున్నారా? | |
| 9 | వంట చేసే సహాయకుల సంఖ్య? | |
| 10 | వంట చేసే సహాయకుల (CCH) గౌరవ వేతనం ఏ నెల వరకు చెల్లించబడింది? | |
| 11 | వంట ఖర్చుల బిల్లులు (కుకింగ్ కాస్ట్) ఏ నెల వరకు చెల్లించబడింది? | |
| 12 | వంట పాత్రల స్థితి | |
| 13 | వంటపాత్రలు అవసరం ఉన్నట్లయితే వాటిని పేర్కొనండి. | |
| 14 | బడితోట (కిచెన్ గార్డెన్) అందుబాటులో ఉందా? లేదా? | |
| 15 | బాలబాలికలకు వేరువేరు మరుగుదొడ్లు ఉన్నాయా? లేవా? | |
| 16 | పారిశుద్ధ్య కార్మికులు పనిచేస్తున్నారా? లేదా? పనిచేస్తున్నట్లయితే వారి సంఖ్య? | |
| 17 | పారిశుద్ధ్య కార్మికులు ప్రధానోపాధ్యాయుని ద్వారా నియమించబడ్డారా? లేదా బయటి సంస్థ ద్వారా నియమించబడ్డారా? | |
| 18 | పారిశుద్ధ్య కార్మికులకు ఏ నెల వరకు గౌరవ వేతనం చెల్లించబడింది? | |
| 19 | గుడ్ల సరఫరా తనిఖీ | |

| | | |
|---|---|---|
| 20 | చిక్కిల సరఫరా తనిఖీ | |
| 21 | సవరించిన ఆహారపట్టిక ముఖ్యమైన ప్రదేశంలో ప్రదర్శించబడిందా? లేదా? | |
| 22 | పాఠశాల ద్వారా నిర్వహించబడే మధ్యాహ్న భోజన పథక రికార్డులను తనిఖీ | |
| 23 | నీటి సదుపాయాల తనిఖీ | |
| 24 | విద్యార్థులు చేతులు శుభ్రం చేసుకునే సదుపాయాల తనిఖీ | |
| 25 | మధ్యాహ్న భోజన పథకం కొరకు నిర్దేశించిన చరవాణి యాప్ పరిశీలించడం, ప్రధానోపాధ్యాయులు సమాచారాన్ని యాప్‌లో అప్‌లోడ్ చేసే విధానం పరిశీలించడం | |
| 26 | పారిశుద్ధ్య చరవాణి యాప్ పరిశీలన | |
| 27 | ఏవైనా ఇతరాలు | |

## ఈ) గ్రామసభ/ వార్డు సభల ద్వారా సామాజిక తనిఖీ

1. మధ్యాహ్న భోజన పథకం పర్యవేక్షణకు నాలుగు/ ఐదు స్థాయిల పర్యవేక్షణ వ్యవస్థ ఉంది. దీనితోపాటుగా ప్రతి సంవత్సరం గ్రామసభ/ వార్డు సభ నిర్వహించాలి మరియు మధ్యాహ్న భోజన పథకానికి సంబంధించిన సామాజిక తనిఖీ నిర్వహించాలి. సంబంధిత పాఠశాల ప్రధానోపాధ్యాయులు, సంక్షేమ మరియు విద్యా సహాయకుడు/ వార్డు సంక్షేమ అభివృద్ధి కార్యదర్శి గత విద్యా సంవత్సరం

మధ్యాహ్న భోజన పథకం యొక్క విజయాలను జూన్ నెల చివరిలోగా గ్రామ/ వార్డు సభ ముందు ఉంచాలి.

2. గ్రామ/వార్డు సభలో సభ్యులు ఇచ్చిన అభిప్రాయాలు, ఫిర్యాదులను ప్రత్యేక రిజిస్టరులో నమోదు చేయాలి. ఈ సామాజిక తనిఖీ ద్వారా మధ్యాహ్న భోజన పథకం విజయవంతంగా అమలు చేయడానికి గ్రామస్థుల్లో అవగాహన కల్పించాలి.

3. ఆహార పట్టిక వివరాలు, ఆహారం తీసుకున్న విద్యార్థుల సంఖ్య, ఇతర సంబంధిత సమాచారాన్ని గ్రామ/ వార్డు సచివాలయాల్లో, పంచాయతీ/ మున్సిపల్ కార్యాలయాల్లో కూడా ప్రదర్శించాలి.

## ఉ) సమావేశాలు

1. ప్రభుత్వ ఉత్తర్వుల్లో పేర్కొన్నట్లు టైమ్ ప్రోటోకాల్ ప్రకారంగా పాఠశాల స్థాయి, మండలస్థాయి, జిల్లా మరియు రాష్ట్ర స్థాయిలో స్టీరింగ్ కమ్ మానిటరింగ్ కమిటీలు నిర్వహించాలి. తద్వారా మధ్యాహ్న భోజన పథకం యొక్క పర్యవేక్షణ విజయవంతంగా అమలు చేయడం మరియు లక్ష్యాలను సాధించడం కొరకు ఉపయోగపడుతుంది.

2. మధ్యాహ్న భోజన పథకం పురోగతిని సమీక్షించడానికి, వ్యవస్థను బలోపేతం చేయడానికి మరియు లక్ష్యాలను సాకారం చేయడానికి జాయింట్ కలెక్టర్ (అభివృద్ధి) వారు ప్రతి నెలా సంబంధిత అధికారులతో సమావేశాలు నిర్వహించాలి.

## ఊ) పాఠశాల తల్లిదండ్రుల కమిటీ (PC)

1. ఉచిత మరియు నిర్బంధ విద్యా హక్కు చట్టం, 2009 కింద తప్పనిసరి చేయబడ్డ తల్లిదండ్రుల కమిటీ మధ్యాహ్న భోజన పథకం అమలును కూడా పర్యవేక్షణ చేయాలి.

2. మధ్యాహ్న భోజన పథకం అమలులో పిల్లలకు అందించే భోజనం నాణ్యత, వంట చేసే ప్రదేశం యొక్క పరిశుభ్రత మరియు పాఠశాల పరిశుభ్రతను తల్లిదండ్రుల కమిటీ పర్యవేక్షించాలి.

3. పాఠశాల యొక్క సంపూర్ణ అభివృద్ధిపై అవసరమైన సూచనల కొరకు తల్లిదండ్రుల కమిటీ సభ్యులతో నెలవారీ సమావేశాలు నిర్వహించాలి.

4. మధ్యాహ్న భోజన పథకం యొక్క పర్యవేక్షణ మెరుగు పరచడం మరియు సమస్యలను ముందుగా గుర్తించి, వేగంగా సరిచేసేవిధంగా పరిష్కారాల కొరకు పేరెంట్-టీచర్ అసోసియేషన్ సమావేశాలు నిర్వహించడం వల్ల పాఠశాల సంపూర్ణ అభివృద్ధి చెందుతుంది.

5. గ్రామ పంచాయితీ/ మున్సిపాలిటీ సభ్యులు మరియు తల్లిదండ్రుల కమిటీ సభ్యులు క్రమంగా పాఠశాలను సందర్శన చేయడం వల్ల వారిని పాఠశాల అభివృద్ధిలో భాగస్వామ్యం చేసినట్లవుతుంది. పాఠశాల నిర్వహణకు చక్కటి సూచనలు కొరకు, నాణ్యమైన వంట, భోజనం వడ్డించడం మరియు శుభ్రత కార్యకలాపాలలో సాయపడటం కొరకు వారిని సంప్రదించవచ్చు.

## ఎ) తల్లుల ప్రమేయం

1. తల్లులకు ఆహారం యొక్క నాణ్యత మరియు క్రమబద్ధత ఉండేలా చూడటం కొరకు వంతుల వారీగా ప్రోత్స హించాలి. ఈ 'తల్లుల వాచీ' యొక్క ఈ సరళమైన జోక్యం, వారికి ఒక వాయిస్ మరియు ఒక పాత్ర మరియు కార్యక్రమం యొక్క అధిక యాజమాన్యత ఇస్తుంది.

2. తల్లుల ప్రమేయం వల్ల వంటలో మెరుగుదల, పరిశుభ్రతలో గణనీయమైన మెరుగుదలకు దోహదపడుతుంది. అలాగే ఉపాధ్యాయుల గైర్హాజరీలో తగ్గుముఖం పట్టి వారి వైఖరిలో మార్పు కూడా చోటు చేసుకుంటుంది.

3. మధ్యాహ్న భోజన పథకంలో తల్లులను భాగస్వామ్యం చేయడం వల్ల సామాజిక చైతన్యం మరియు విస్తృత ప్రచారం చేసినట్లవుతుంది.

4. తల్లులు సమర్థవంతమైన భాగస్వామ్యం ద్వారా

   - తల్లులు తమవంతు పాత్రను పోషించి, వంటల తయారీని, భోజనం చేసే ప్రదేశాన్ని పర్యవేక్షణ మరియు పాఠశాల పరిశుభ్రత మెరుగుపడటం.

   - తల్లుల ప్రమేయం ద్వారా భోజనంలో క్రమబద్ధత, నాణ్యతలో గణనీయంగా అభివృద్ధి జరుగుతుందనే వాస్తవాన్ని తెలియజేయడం.

   - ఈ కార్యక్రమం యొక్క కీలక మైన భావనల గురించి తల్లులకు అవగాహన కలిగించడం, వారు పర్య వేక్షించాల్సిన విషయాల మీద అవగాహన కలిగించడం.

- సంవత్సరంలో ప్రత్యేక రోజులలో వారు పాఠశాల కార్యక్రమాల్లో సమర్థవంతంగా పాల్గొనేందుకు దోహదపడుతుంది.

- కార్యక్రమ వ్యూహాలను బలోపేతం చేయడం కొరకు, కమ్యూనిటీ భాగస్వామ్యాన్ని పెంపొందించడం కొరకు, భోజనం నాణ్యత మెరుగుపరచడం కొరకు తల్లుల యొక్క సూచనలు పొందడం.

## ఏ) అభిప్రాయ సేకరణ

1. మధ్యాహ్న భోజన పథకం నాణ్యత మరియు పరిమాణం మీద అవగాహన కల్పించడం, అభిప్రాయ సేకరణ మరియు ఫిర్యాదులు వంటివి స్వీకరించడం కోసం విద్యార్థుల తల్లి దండ్రుల చరవాణులకు నిత్యం సందేశాలు (ఎస్ఎమ్ఎస్) పంపుతూ ఉండాలి.

2. తల్లిదండ్రుల నుంచి ఏదైనా ఫిర్యాదు లేదా అభిప్రాయాన్ని తెలపడానికి రికార్డ్ చేయబడేవిధంగా టోల్‌ఫ్రీ నెంబరు ఇవ్వాలి మరియు ఫిర్యాదును పరిష్కరించాలి.

3. మధ్యాహ్న భోజన పథకంలో భోజన శాల, భోజనం తినే ప్రాంతం, ఆహార పాత్రలు, వాష్ బేసిన్, ప్లేట్లు, గ్లాసులు, తాగునీటి సరఫరా వంటి అన్ని అంశాల దగ్గర పిల్లలు స్నేహపూర్వకంగా ఉండాలి, తద్వారా పిల్లలకు మధ్యాహ్న భోజనం సక్రమంగా, సురక్షితంగా మరియు హుందాగా ఉండే విధంగా పొందడంలో ఎలాంటి అసౌకర్యం ఉండదు.

## XII) స్కూలు ఆరోగ్య కార్యక్రమం

1. జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ విభాగాలను సంప్రదించి, పాఠశాల ఆరోగ్య కార్యక్రమాన్ని (స్కూలు హెల్త్ ప్రోగ్రామ్) మరింత మెరుగ్గా నిర్వహించేందుకు జిల్లా విద్యాశాఖాధికారి చొరవ తీసుకోవాలి.

2. పిల్లల యొక్క సరైన ఆరోగ్య నిర్వహణ కొరకు అన్ని పాఠశాలల్లో "రాష్ట్రీయ బాల స్వస్థ్య కార్యక్రమం (ఆర్‌బిఎస్‌కె, (పాఠశాల ఆరోగ్య కార్యక్రమం)" అమలు చేయబడుతుంది.

3. క్షేత్రస్థాయి అధికారులు/ ప్రధానోపాధ్యాయులు పాఠశాలల్లో వైద్య తనిఖీ క్యాంపులు, వైద్య మరియు ఆరోగ్యశాఖ ద్వారా పిల్లలకు అవసరమైన డీవార్మింగ్ మాత్రలు, విటమిన్-ఎ, ఐరన్ మరియు ఫోలిక్ యాసిడ్ మాత్రలు మొదలైన వాటిని సరఫరా చేసేలా చూడాలి.

4. మండల విద్యాశాఖాధికారులు/ ప్రధానోపాధ్యాయులు తప్పనిసరిగా 'వైఎస్సార్ కంటి వెలుగు' పథకం ద్వారా పిల్లల కంటి చూపును తనిఖీ చేయించి, అవసరమైన వారికి కళ్లజోళ్లు అందేలా చూడాలి. మరియు శస్త్రచికిత్సలు అవసరమైనవారికి పై అధికారులను సంప్రదించి శస్త్ర చికిత్సలు చేయించాలి.

5. ప్రత్యేక అవసరాలు గల పిల్లలకు (సీడబ్ల్యూఎస్ఎన్) అవసరమైన ఉపకరణాలు సమగ్రశిక్షా ద్వారా అందేటట్లు చూడాలి.

5. వైద్య ఆరోగ్యశాఖ వారి సహాయంతో పిల్లలకు అవసరమైన శరీర (ఆంత్రోపోమెట్రిక్) కొలతలు చేపట్టాలి.

6. జిల్లా విద్యాశాఖాధికారి ఆరోగ్య శాఖతో సంప్రదించి విద్యార్థులకు సంబంధించి ఒక ఆరోగ్య ప్రణాళికను తయారు చేయాలి.

# సవరించిన ఆహారపట్టిక

| వారం | నూతన మెనూ ప్రణాళికా వివరాలు |
|---|---|
| **సోమవారం** | వండిన అన్నం, పప్పుచారు, గుడ్డు కూర మరియు చిక్కి |
| **మంగళవారం** | చింతపండు / నిమ్మకాయ / మామిడికాయ అన్నం (పులిహోర), టమోటా పప్పు మరియు ఉడికించిన గుడ్డు |
| **బుధవారం** | కూరగాయల అన్నం, బంగాళదుంప కుర్మా, ఉడికించిన గుడ్డు మరియు చిక్కి |
| **గురువారం** | కిచిడి (పెసరపప్పు అన్నం), టమోటా పచ్చడి మరియు ఉడికించిన గుడ్డు |
| **శుక్రవారం** | వండిన అన్నం, ఆకుకూర పప్పు, ఉడికించిన గుడ్డు మరియు చిక్కి |
| **శనివారం** | వండిన అన్నం, సాంబారు మరియు తీపి పొంగలి |

# ఆహార నిబంధనలు పాతవి / కొత్తవి

| వివరములు | ప్రాథమిక | | ప్రాథమికోన్నత / ఉన్నత | |
|---|---|---|---|---|
| | పాతవి | కొత్తవి | పాతవి | కొత్తవి |
| బియ్యం | 100 గ్రా/రో. | 100 గ్రా/రో. | 150 గ్రా/రో. | 150 గ్రా/రో. |
| పప్పులు (కందిపప్పు) | 20 గ్రా/రో. | 16 గ్రా/రో. | 30 గ్రా/రో. | 23 గ్రా/రో. |
| కూరగాయలు (ఆకుకూరతో) | 50 గ్రా/రో. | 57 గ్రా/రో. | 75 గ్రా/రో. | 87 గ్రా/రో. |
| నూనెలు | 5.0 గ్రా/రో. | 7 గ్రా/రో. | 7.5 గ్రా/రో. | 9.7 గ్రా/రో. |
| కోడిగుడ్లు | వారానికి 5 | వారానికి 5 | వారానికి 5 | వారానికి 5 |
| మసాలా దినుసులు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| చిక్కి | | వారానికి 3 | | వారానికి 3 |

# 1. పప్పుచారు

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| కందిపప్పు | 10 గ్రాములు | 1 కిలో | 15 గ్రాములు | 1.5 కిలో |
| ఉల్లిపాయలు | 5 గ్రాములు | 500 గ్రాములు | 10 గ్రాములు | 1 కిలో |
| టమాటాలు | 5 గ్రాములు | 500 గ్రాములు | 10 గ్రాములు | 1 కిలో |
| నూనె | 2.5 గ్రాములు | 250 గ్రాములు | 3 గ్రాములు | 300 గ్రాములు |
| తాలింపు దినుసులు (చింతపండు, జీలకర్ర, ఎండుమిర్చి, కరివేపాకు మొదలైనవి) | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- కందిపప్పును రాళ్ళు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- శుభ్రం చేసిన కందిపప్పును మంచినీటిలో కడిగి, నీళ్ళుపోసి నాన బెట్టుకోవాలి.
- చింతపండును నానబెట్టి, గుజ్జును తీసుకోవాలి.
- ఉల్లిపాయలు, టమాటాలను ఉప్పునీటిలో వేసి బాగా కడిగి, పెద్ద ముక్కలుగా కోసుకోవాలి.
- తాలింపు దినుసులు (జీలకర్ర, ఆవాలు, కరివేపాకు, ఎండుమిర్చి, వెల్లుల్లి)ను పక్కన పెట్టుకోవాలి.

## తయారీ విధానం

- ముందుగా శుభ్రం చేసిన కందిపప్పును తీసుకొని, సరిపడా నీళ్ళు పోసి మెత్తగా ఉడికించుకోవాలి.
- ఉడికిన పప్పును బాగా మెదిపి ముందు తగినంత రసం, తగినన్ని ఉల్లిపాయలు, టమాటా ముక్కలు, ఉప్పు, కారం, పసుపు వేసి మరిగించుకోవాలి (ఉడికించాలి).
- బాగా మరిగిన పప్పుచారులో పోపువేసి కలుపుకోవాలి.

## 2. గుడ్డు కూర

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| గుడ్డు | 1 | 100 | 1 | 100 |
| ఉల్లిపాయలు | 5 గ్రాములు | 500 గ్రాములు | 10 గ్రాములు | 1 కిలో |
| టమాటాలు | 20 గ్రాములు | 2 కిలోలు | 30 గ్రాములు | 3 కిలోలు |
| ఇతర కూరగాయలు ★ | 10 గ్రాములు | 1 కిలో | 15 గ్రాములు | 1.5 కిలోలు |
| నూనె | 4 గ్రాములు | 400 గ్రాములు | 6 గ్రాములు | 600 గ్రాములు |
| కొత్తిమీర/ పుదీనా | 5 గ్రాములు | 500 గ్రాములు | 7.5 గ్రాములు | 750 గ్రాములు |
| కరివేపాకు | 5 గ్రాములు | 500 గ్రాములు | 7.5 గ్రాములు | 750 గ్రాములు |
| తాలింపు దినుసులు ★★ | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| చింతపండు రసం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

★ దోసకాయలు, వంకాయలు, బంగాళదుంపలు మొదలైనవి.

★★ ఆవాలు, జీలకర్ర, అల్లం, వెల్లుల్లి, ఎండుమిర్చి మొదలైనవి.

# గుడ్డు కూర చేయటానికి కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- ముందుగా గుడ్డును మంచినీళ్ళలో ఉడకబెట్టి, పెంకుతీసి పక్కన పెట్టుకోవాలి.
- అల్లాన్ని నీటిలో నానబెట్టి, బాగా కడిగి పై పొట్టు తీసి ముక్కలుగా కోసుకోవాలి.
- వెల్లుల్లి రెబ్బల పొట్టును తీసి, ముందుగా శుభ్రం చేసిన అల్లం ముక్కలతో కలిపి ముద్దగా రుబ్బుకోవాలి / మిక్సీ పట్టుకోవాలి.
- ఉల్లిపాయలు, టమాటాలు, పచ్చిమిర్చి మరియు ఇతర కూరగాయలు (దోసకాయ, ఆనపకాయ, వంకాయ, బంగాళదుంపలు) ఉప్పు నీటిలో కడిగి ముక్కలుగా కోసుకోవాలి.
- కొత్తిమీర / పుదీనా, కరివేపాకు మంచినీటిలో కడిగి తరగాలి.

## తయారీ విధానం

- ఒక కడాయి తీసుకొని ముందు చెప్పినంత నూనెను పోసి వేడి చెయ్యాలి.
- వేడి అయిన నూనెలో తాలింపు గింజలు వేసి, తాలింపు సిద్ధం అయిన తరువాత ఉల్లిపాయ ముక్కలు, టమాటా ముక్కలు, కరివేపాకుతో పాటు తరిగిన పచ్చిమిర్చి మరియు కూరగాయ ముక్కలు (దోసకాయ, ఆనపకాయ, వంకాయ, బంగాళదుంపలు) వేసి వేయించుకోవాలి.
- ఇది వేగేటప్పుడు అల్లం, వెల్లులి ముద్దను వేసి, చక్కగా మాడిపోకుండా వేయించుకోవాలి.

- ఇందులో ముందు చెప్పినంత పరిమాణంలో ఉప్పు, కారం, పసుపు వేసి మూత పెట్టుకోవాలి.
- కూర గుజ్జుగా వచ్చిన తరువాత ముందు ఉడికించిన కోడిగుడ్లకు గాట్లు పెట్టి కూరలో వేసి బాగా కలుపుకోవాలి.

## 3. పులిహోర

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| బియ్యం | 100 గ్రాములు | 10 కిలోలు | 150 గ్రాములు | 15 కిలోలు |
| పల్లీలు | 10 గ్రాములు | 1 కిలో | 15 గ్రాములు | 1.5 కిలోలు |
| నూనె | 2.5 గ్రాములు | 250 గ్రాములు | 3.5 గ్రాములు | 350 గ్రాములు |
| తాలింపు దినుసులు * | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| చింతపండు రసం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పచ్చిమిర్చి | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

* ఆవాలు, జీలకర్ర, ఎండుమిర్చి, పచ్చిపప్పు, కరివేపాకు మొదలైనవి.

# పులిహోర చేయటానికి
# కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- బియ్యంలో రాళ్ళు, పురుగులు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- బియ్యాన్ని నీటిలో కడిగి శుభ్రం చేసుకోవాలి.
- చింతపండును నానబెట్టి, గుజ్జును తీసి పక్కన పెట్టుకోవాలి.
- పచ్చిమిర్చిని కడిగి, పొడవు ముక్కలుగా కోసుకోవాలి.
- కావలసిన తాలింపు దినుసులను సిద్ధం చేసుకోవాలి.

## తయారీ విధానం

- శుభ్రపరచిన బియ్యానికి, ముందు చెప్పినంత పరిమాణంలో వేడినీరు, కొద్దిగా నూనె, పసుపు వేసి అన్నం తయారు చేసుకోవాలి.
- ఒక కడాయి తీసుకొని, మిగిలిన నూనె వేసి వేడి చెయ్యాలి.
- వేడి అయిన నూనెలో ముందు చెప్పిన పరిమాణంలో తాలింపు దినుసులు (ఆవాలు, ఎండుమిర్చి, కరివేపాకు, పచ్చిపప్పు, పల్లీలు, మినపప్పు) తరిగిన పచ్చిమిర్చి వేసి, వేగిన తరువాత పసుపు, ముందుగా తీసి ఉంచిన చింతపండు రసం తగినంత ఉప్పు వేసి మూత పెట్టి ఉడికించాలి.
- సిద్ధమైన పలిహోర తాలింపును ముందుగా ఉడికిన అన్నానికి కలుపుకోవాలి.

# 4. టమాటా పప్పు

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| కందిపప్పు | 20 గ్రాములు | 2 కిలోలు | 30 గ్రాములు | 3 కిలోలు |
| ఉల్లిపాయలు | 5 గ్రాములు | 500 గ్రాములు | 10 గ్రాములు | 1 కిలో |
| టమాటాలు | 30 గ్రాములు | 3 కిలోలు | 40 గ్రాములు | 4 కిలోలు |
| ఇతర కూరగాయలు | 10 గ్రాములు | 1 కిలో | 10 గ్రాములు | 1 కిలో |
| నూనె | 4 గ్రాములు | 400 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| తాలింపు దినుసులు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| చింతపండు రసం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

# టమాటా పప్పు చేయుటానికి
# కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- కందిపప్పును రాళ్ళు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- శుభ్రం చేసిన కందిప్పును మంచినీటిలో కడిగి పక్కన పెట్టుకోవాలి.
- ఉల్లిపాయలు, టమాటాలు, కూరగాయలను ఉప్పునీటిలో కడిగి, ముక్కలుగా కోసుకోవాలి.
- చింతపండును నానపెట్టి గుజ్జు తీసుకోవాలి.
- కావలసిన తాలింపు దినుసులను సిద్ధం చేసుకోవాలి.

## తయారీ విధానం

- ఒక గిన్నెలో కడిగిన పప్పును తీసుకొని, సరిపడా నీళ్ళుపోసి ఉడికించుకోవాలి.
- ఉడికిన పప్పులో తరిగిన టమాటా ముక్కలు, కూరగాయ ముక్కలు (దోసకాయ, క్యారెట్, బంగాళదుంపలు) వేసి మగ్గిన తరువాత ఉడికిన పప్పును కొంచెం మెదుపుకోవాలి.
- ఈ మిశ్రమంలో చింతపండు రసం, ఉప్పు వేసి ఉడికించుకోవాలి.
- ఇందులో పోపువేసి కలుపుకోవాలి.

## 5. కూరగాయల (వెజిటబుల్) బిర్యాని

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| బియ్యం | 100 గ్రాములు | 10 కిలోలు | 150 గ్రాములు | 15 కిలోలు |
| ఇతర కూరగాయలు ★ | 25 గ్రాములు | 2.5 కిలోలు | 35 గ్రాములు | 3.5 కిలోలు |
| కొత్తిమీర | 5 గ్రాములు | 500 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| కరివేపాకు | 5 గ్రాములు | 500 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| నూనె | 4 గ్రాములు | 400 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| తాలింపు దినుసులు ★★ | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పచ్చిమిర్చి | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| అల్లం వెల్లుల్లి ముద్ద | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

★ కారెట్స్, బీన్స్, బంగాళదుంపలు, బఠానీలు మొదలైనవి.

★★ యాలకులు, లవంగాలు, దాల్చినచెక్క మొదలైనవి.

# కూరగాయల (వెజిటబుల్)
# బిర్యాని చేయుటానికి కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- బియ్యంలో రాళ్ళు, పురుగులు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- బియ్యాన్ని మంచినీటిలో శుభ్రంగా కడిగి, నానబెట్టుకోవాలి.
- కూరగాయలను (క్యారెట్స్, బంగాళదుంపలు, బీన్స్, టమాటాలు, ఉల్లిపాయలు) ఉప్పునీటిలో కడిగి కావలసిన సైజులో ముక్కలుగా కోసుకోవాలి.
- ఎండు బఠాణీ అయితే నానబెట్టుకోవాలి.
- అల్లాన్ని మట్టిపోయే వరకు ఉప్పు నీటిలో నానబెట్టి పై పొట్టు తీసి ముక్కలుగా కోసుకోవాలి.
- వెల్లుల్లి రెబ్బలను పొట్టు తీసి, ముందుగా శుభ్రం చేసిన అల్లం ముక్కలతో కలిపి మిక్సీ పట్టాలి / రుబ్బుకోవాలి.
- దాల్చిన చెక్క, యాలకులు, లవంగాలు, గరంమసాల పొడి తీసి సిద్ధంగా వుంచుకోవాలి.

## తయారీ విధానం

- ఒక కడాయి తీసుకొని సరిపడా నూనె / నెయ్యి వేసి, వేడి చెయ్యాలి.
- కాగిన నూనె / నెయ్యిలో దాల్చిన చెక్క, లవంగాలు, యాలకులు, గరంమసాలా పొడి, ఉల్లిపాయ ముక్కలు, పుదీనా వేసి వేయించుకోవాలి.

- ఈ మిశ్రమంలో అల్లం వెల్లుల్లి ముద్దను వేసి, వేగిన తరువాత తరిగిన కూరగాయ ముక్కలు (బంగాళదుంపలు, క్యారెట్స్, బీన్స్, బఠాణీలు) వేసి వేయించుకోవాలి.
- కూరగాయ ముక్కలు మగ్గుతున్నప్పుడు ఉప్పు వేసి బాగా కలుపుకోవాలి.
- చివరిగా నాన బెట్టిన బియ్యంవేసి, కొద్దిగా వేయించుకోవాలి. (ఇలా వేయించడం వల్ల అన్నం ముద్ద కాదు).
- దీనిలో సరిపడా నీళ్ళు పోసి ఉడికిన తరువాత దించుకోవాలి.

# 6. కుర్మా

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| ఇతర కూరగాయలు ★ | 15 గ్రాములు | 1.5 కిలోలు | 15 గ్రాములు | 1.5 కిలోలు |
| ఉల్లిపాయలు | 10 గ్రాములు | 1 కిలో | 20 గ్రాములు | 2 కిలోలు |
| టమాటాలు | 10 గ్రాములు | 1 కిలో | 20 గ్రాములు | 2 కిలోలు |
| కొత్తిమీర | 5 గ్రాములు | 500 గ్రాములు | 7.5 గ్రాములు | 750 గ్రాములు |
| కరివేపాకు | 5 గ్రాములు | 500 గ్రాములు | 7.5 గ్రాములు | 750 గ్రాములు |
| నూనె | 4 గ్రాములు | 400 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| తాలింపు దినుసులు ★★ | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| బంగాళదుంపలు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఎండుకొబ్బరి | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| నువ్వులు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

★ కారెట్స్, బీన్స్, బంగాళదుంపలు, బఠానీలు మొదలైనవి.

★★ యాలకులు, లవంగాలు, దాల్చినచెక్క, అల్లం, వెల్లుల్లి మొదలైనవి.

# కుర్మా చేయుటానికి కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- బంగాళదుంపలు, ఉల్లిపాయలు, టమాటాలు, కారెట్, బీన్స్ ఉప్పునీటిలో కడిగి ముక్కలుగా కోసుకోవాలి.
- అల్లాన్ని మట్టిపోయే వరకు నీటిలో నానబెట్టి పై పొట్టు తీసి ముక్కలుగా కోసుకోవాలి.
- వెల్లుల్లి రెబ్బలు పొట్టు తీసి పక్కన పెట్టుకోవాలి.
- నువ్వులను వేయించి అల్లం, వెల్లుల్లి, ఎండుకొబ్బరి / పచ్చి కొబ్బరితో కలిపి రుబ్బుకోవాలి / మిక్సీపట్టాలి.
- దాల్చిన చెక్క, యాలకులు, లవంగాలు సిద్ధం చేసుకోవాలి.

## తయారీ విధానం

- ఒక కడాయి తీసుకొని సరిపడా నూనె వేసి వేడి చేయాలి.
- వేడి అయిన / కాగిన నూనెలో దాల్చిన చెక్క, యాలకులు, లవంగాలు, తరిగిన ఉల్లిపాయ ముక్కలు వేసి వేగనివ్వాలి.
- ఉల్లిపాయలు వేగిన తరువాత మిక్సీ పట్టిన మిశ్రమాన్ని (ఎండుకొబ్బరి / పచ్చికొబ్బరి / వేయించిన నువ్వులు, అల్లం వెల్లుల్లి) వేసి వేయించుకోవాలి.
- ఇప్పుడు తరిగిన కూరగాయ ముక్కలు వేసి మగ్గనివ్వాలి.
- కూరగాయ ముక్కలు మరిగిన తరువాత టమాటా ముక్కలు పసుపు, కారం వేసి మగ్గిన తరువాత ఉప్పువేసి సన్నని సెగపై వేయించుకోవాలి.
- చివరిగా సరిపడా నీళ్ళు పోసి కూర గుజ్జుగా వచ్చేంతవరకూ ఉడికించుకోవాలి.

# 7. కిచిడీ

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| బియ్యం | 100 గ్రాములు | 10 కిలోలు | 150 గ్రాములు | 15 కిలోలు |
| పెసరపప్పు | 20 గ్రాములు | 2 కిలోలు | 30 గ్రాములు | 3 కిలోలు |
| ఉల్లిపాయలు | 10 గ్రాములు | 1 కిలో | 15 గ్రాములు | 1.5 కిలో |
| టమాటాలు | 10 గ్రాములు | 2 కిలో | 15 గ్రాములు | 3 కిలో |
| నూనె | 4 గ్రాములు | 400 గ్రాములు | 7 గ్రాములు | 700 గ్రాములు |
| తాలింపు దినుసులు * | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పచ్చిమిర్చి | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| అల్లంవెల్లుల్లి ముద్ద | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

*దాల్చిన చెక్క, లవంగం, యాలకులు మొదలైనవి

# కిచిడీ చేయుటానికి కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- బియ్యం మరియు పెసరపప్పును రాళ్ళు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- శుభ్రం చేసిన పెసరపప్పు, బియ్యంను మంచినీటిలో కడిగి నానబెట్టుకోవాలి.
- అల్లాన్ని నానబెట్టి బాగా కడిగి పొట్టు తీసి ముక్కలుగా తరగాలి.
- వెల్లుల్లి రెబ్బలను పొట్టుతీసి ముందుగా శుభ్రం చేసిన అల్లంతో కలిపి మిక్సీ పట్టుకోవాలి / రుబ్బుకోవాలి.

## తయారీ విధానం

- ముందుగా ఒక కడాయి తీసుకొని సరిపడా నూనె వేసి వేడి చెయ్యాలి.
- కాగిన నూనెలో దాల్చిన చెక్క, లవంగాలు, యాలకులు వేసి వేగనివ్వాలి.
- ఇందులో తరిగిన ఉల్లిపాయ ముక్కలు వేసి, వేగిన తరువాత, తరిగిన పచ్చిమిర్చి ముందు తయారు చేసిన అల్లం వెల్లుల్లి ముద్ద వేసి వేయించుకోవాలి.
- ఇప్పుడు తరిగిన టమాటా ముక్కలు వేసి మగ్గనివ్వాలి.
- ఇందులో నానబెట్టి ఉంచిన బియ్యం, పెసరపప్పు వేసి వేయించిన తరువాత ముందుగా చెప్పిన పరిమాణంలో నీళ్ళు పోసి ఉప్పు వేసి సన్నని మంట (సెగపై) ఉడికించుకోవాలి.

# 8. టమాటా పచ్చడి

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| టమాటాలు | 40 గ్రాములు | 4 కిలోలు | 45 గ్రాములు | 4.5 కిలోలు |
| నూనె | 2.5 గ్రాములు | 250 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| చింతపండు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పచ్చిమిర్చి | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| జీలకర్ర | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| వెల్లుల్లి | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

# టమాటా పచ్చడి చేయుటానికి

# కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- టమాటాలు, పచ్చిమిర్చిని ఉప్పునీటితో కడిగి పెద్ద ముక్కలుగా కోసుకోవాలి.
- వెల్లుల్లిని పొట్టు తీసుకొని పక్కనపెట్టుకోవాలి.
- చింతపండును నీటిలో నానబెట్టి చిక్కని గుజ్జును తీసుకోవాలి.

## తయారీ విధానం

- ఒక కడాయి తీసుకొని సరిపడా నూనె వేసి వేడి చేయాలి.
- మరిగిన నూనెలో తరిగిన పచ్చిమిర్చి, టమాటా ముక్కలు వేసి బాగా మరగినివ్వాలి.
- కాసేపటి తరువాత వేయించిన టమాటా ముక్కలు, పచ్చిమిర్చి, జీలకర్ర, వెల్లుల్లి, చింతపండు రసం, సరిపడా ఉప్పు వేసి మిక్సీ పట్టుకోవాలి.
- మిక్సీ పట్టిన తర్వాత తాలింపు వేసుకోవాలి.

# 9. ఆకుకూర పప్పు

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| కందిపప్పు | 20 గ్రాములు | 2 కిలోలు | 30 గ్రాములు | 3 కిలోలు |
| ఆకు కూర | 50 గ్రాములు | 5 కిలోలు | 75 గ్రాములు | 7.5 కిలోలు |
| నూనె | 5 గ్రాములు | 500 గ్రాములు | 7.5 గ్రాములు | 750 గ్రాములు |
| తాలింపు దినుసులు ఎండుమిర్చి, వెల్లుల్లి, ఆవాలు, జీలకర్ర | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| చింతపండు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

# ఆకుకూర పప్పు చేయటానికి
# కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- కందిపప్పును రాళ్ళు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- శుభ్రం చేసిన కందిపప్పును మంచినీళ్ళతో కడిగి, నీళ్ళు పోసి పక్కన పెట్టాలి.
- చీడ, పీడలేని ఆకు కూరను తీసుకొని, మంచి నీళ్ళతో కడిగి పెద్దగా ఆకుకూరను కోసుకోవాలి.
- తాలింపు దినుసులు (ఆవాలు, జీలకర్ర, వెల్లుల్లి, ఎండుమిర్చి, కరివేపాకు) తీసి పక్కన పెట్టుకోవాలి.
- చింతపండును నానబెట్టి, గుజ్జు తీసుకోవాలి.

## తయారీ విధానం

- ముందుగా శుభ్రం చేసిన కందిపప్పును మరియు ఆకుకూరను తీసుకొని సరిపడా నీళ్ళుపోసి, కారం, పసుపు వేసి ఉడికించు కోవాలి.
- ఉడికిన పప్పుని బాగా మెదిపి, దానిలో చింతపండు గుజ్జు, ఉప్పు వేసి బాగా కలిపి మరలా ఉడికించాలి.
- ఈ మిశ్రమంలో పోపు వేసి కలుపుకోవాలి.

# 10. సాంబారు

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| కందిపప్పు | 20 గ్రాములు | 2 కిలోలు | 30 గ్రాములు | 3 కిలోలు |
| ఉల్లిపాయలు | 5 గ్రాములు | 500 గ్రాములు | 10 గ్రాములు | 1 కిలో |
| టమాటాలు | 10 గ్రాములు | 1 కిలో | 20 గ్రాములు | 2 కిలోలు |
| ఇతర కూరగాయలు* | 15 గ్రాములు | 1.5 కిలోలు | 20 గ్రాములు | 2 కిలోలు |
| ఆకు కూర | 10 గ్రాములు | 1 కిలో | 20 గ్రాములు | 2 కిలోలు |
| నూనె | 5 గ్రాములు | 500 గ్రాములు | 5 గ్రాములు | 500 గ్రాములు |
| తాలింపు దినుసులు ** | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| చింతపండు రసం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| ఉప్పు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| కారం | తగినంత | తగినంత | తగినంత | తగినంత |
| పసుపు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

* ఆనపకాయ, దోసకాయ, బీన్స్, గుమ్మడికాయ, బెండకాయ, క్యారెట్, చిలకడదుంప, ముల్లంగి, కరివేపాకు, కొత్తిమీర

** ఎండుమిర్చి, వెల్లుల్లి, ఆవాలు, జీలకర్ర, సాంబారుపొడి

# సాంబారు చేయుటానికి

# కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- కందిపప్పులో రాళ్ళు లేకుండా శుభ్రం చేసుకోవాలి.
- శుభ్రం చేసిన కందిపప్పును, మంచినీటితో కడగాలి.
- టమాటాలు, ఉల్లిపాయలు, ఇతర కూరగాయలు (ఆనపకాయ, దోసకాయ, ముల్లంగి, గుమ్మడికాయ, క్యారెట్స్ మొదలైనవి) ఉప్పునీటిలో కడిగి పెద్ద ముక్కలుగా కోసుకోవాలి.
- చింతపండును నానబెట్టి, గుజ్జు తీసుకోవాలి.
- తాలింపు దినుసులు (ఎండుమిర్చి, వెల్లుల్లి, జీలకర్ర, ఆవాలు, కరివేపాకు) తీసుకొని సిద్ధంగా ఉంచుకోవాలి.

## తయారీ విధానం

- ముందుగా శుభ్రం చేసి ఉంచిన కందిపప్పును తీసుకొని, సరిపడా నీళ్ళు పోసి మెత్తగా ఉడికించుకోవాలి.
- ఉడికిన పప్పును బాగా మెదపాలి.
- మెదిపిన పప్పులో చింతపండు రసం, ఉల్లిపాయలు, టమాటాలు, కారం, పసుపు, సాంబారుపొడి కూరగాయ ముక్కలు వేసి బాగా మగ్గనివ్వాలి.
- ఆ తరువాత మరిగిన మిశ్రమంలో పోపు వేసి కలుపుకోవాలి.

# సాంబారు పొడి తయారీ విధానం

## కావలసిన పదార్థాలు

| | | |
|---|---|---|
| పచ్చిశనగపప్పు | - | 100 గ్రా. |
| మినపప్పు | - | 100 గ్రా. |
| ధనియాలు | - | 100 గ్రా. |
| జీలకర్ర | - | 50 గ్రా. |
| మిరియాలు | - | 50 గ్రా. |
| ఎండుమిర్చి | - | 100 గ్రా. |
| ఇంగువ | - | 20 గ్రా. |

పై చెప్పిన అన్ని పదార్థాలను వేరువేరుగా వేయించుకొని, పొడికొట్టుకొని పొడి గాలి చొరబడని డబ్బాలో నిల్వ ఉంచుకోవాలి.

## 11. తీపి (బెల్లం) పొంగలి

| కావలసిన పదార్థాలు | ప్రాథమిక పాఠశాల విద్యార్థులు | | ఉన్నత పాఠశాల విద్యార్థులు | |
|---|---|---|---|---|
| | ఒకరికి | వంద మందికి | ఒకరికి | వంద మందికి |
| బియ్యం | 25 గ్రాములు | 2.5 కిలోలు | 35 గ్రాములు | 3.5 కిలోలు |
| పెసరపప్పు | 10 గ్రాములు | 1 కిలో | 20 గ్రాములు | 2 కిలోలు |
| నెయ్యి | 4 గ్రాములు | 400 గ్రాములు | 7 గ్రాములు | 700 గ్రాములు |
| బెల్లం | 12 గ్రాములు | 1.2 కిలోలు | 15 గ్రాములు | 1.5 కిలోలు |
| యాలకులు | తగినంత | తగినంత | తగినంత | తగినంత |

# తీపి (బెల్లం) పొంగలి చేయుటానికి కావలసిన పదార్థాలు



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- బియ్యాన్ని మంచినీటిలో కడిగి శుభ్రం చేసుకొని, నానబెట్టాలి.
- పెసరపప్పులో రాళ్ళు లేకుండా శుభ్రం చేసి నీటితో కడిగి పక్కన పెట్టుకోవాలి.
- బెల్లాన్ని పొడిగా చేసి పెట్టుకోవాలి.
- యాలకులు పొడిగా తయారు చేసుకోవాలి.

## తయారీ విధానం

- ఒక కడాయి తీసుకొని, నెయ్యి వేసి వేడిచెయ్యాలి.
- కాగిన నెయ్యిలో నానబెట్టిన బియ్యం, పెసరపప్పును వేసి సన్నని సెగ (మంట)పై వేయించి, ముందుగా చెప్పినన్ని నీళ్ళు పోసి ఉడికించాలి.
- ఉడికిన మిశ్రమంలో బెల్లం పొడి వేసి కొద్ది సేపు ఉడికించుకోవాలి.
- చివరిగా యాలకుల పొడి వేయాలి.

## 12. వేరుశనగ చిక్కీలు

### కావలసిన పదార్థాలు

వేరుశనగ పప్పులు – 2 కిలోలు

బెల్లం – 1 కిలో

యాలకలు పొడి తగినంత



## ముందుగా సిద్ధం చేసుకోవలసిన పదార్థాలు

- ముందుగా వేరుశనగ పప్పును తీసుకొని, పొట్టు పోయేవరకు వేయించాలి.
- ఒక కడాయిలో నీళ్ళు తీసుకొని మెత్తగా మెదిపిన బెల్లం వేసి కరగనివ్వాలి.
- ఈ మిశ్రమాన్ని పొయ్యి మీద పెట్టి తీగ పాకం వచ్చే వరకు మరగనివ్వాలి.
- తరువాత ఇందులో యాలకల పొడి వేసి కలపాలి.
- బెల్లం మిశ్రమం ముదురు పాకం వచ్చాక అందులో ముందుగా వేయించిన వేరుశనగలు వేసి బాగా కలపాలి.
- చివరిగా పొయ్యి మీద నుంచి దించి కావలసిన పరిమాణంలో (25 గ్రా) చిక్కిలు చేసుకోవాలి.

## పాఠశాలలో ఆరోగ్య రక్షణ విధానంలో నిర్ధిష్టమైన ( ప్రామాణికమైన) నిర్వహణ పద్ధతి

### పరిచయం :

పాఠశాల ఆరోగ్య రక్షణ అనేది భారత ప్రభుత్వం ద్వారా నిర్వహింపబడుచున్న కార్యక్రమాలలో ఒక ప్రధానమైన అంశము. ఇది ప్రతి యాజమాన్య పాఠశాలలో చదువుచున్న విద్యార్థులకు ఆరోగ్య ప్రమాణాలను పెంచుతూ వారి విద్యాభివృద్ధికి తోడ్పడే విధానం. దీనిలో భాగంగా ప్రభుత్వ, స్థానిక సంస్థల పాఠశాలలో మరుగుదొడ్ల నిర్మాణం ప్రారంభించుటకు భారత ప్రభుత్వం 1999లో నిర్ణయం తీసుకొనుట జరిగింది. 2003 నాటికి సుమారు 1,40,000 పాఠశాలలో నిర్మాణం జరిగినది. 2012 వ సంవత్సరంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ వారి సూచనలనుసరించి బాలికల ఋతుచక్ర సమస్యలు, మూత్రాశయ సమస్యలు మొదలైనవి దృష్టిలో ఉంచుకొని బాలికలకు వేరుగా మూత్రాశాలలు మరియు మరుగుదొడ్లు నిర్మించుటకు ప్రభుత్వం ఎక్కువ ప్రాధాన్యతను కల్పించినది. 2014 స్వాతంత్ర్య దినోత్సవం నాడు ప్రస్తుత ప్రధాన మంత్రివర్యులు " స్వచ్ఛ భారత్ - స్వచ్ఛ విద్యాలయం" పేరిట అన్నీ పాఠశాలలో MHRD ద్వారా బాలురకు, బాలికలకు వారి సంఖ్య అనుసరించి మూత్ర మరియు మరుగుదొడ్ల నిర్మాణం, నిర్వహణ విషయమై సమగ్ర శిక్ష అభియాన్ (SSA) పథకాల ద్వారా చర్యలు తీసుకొనుట, బాగా నిర్వహణ జరుగుచున్న పాఠశాలలను, మండలాలను, జిల్లాలను గుర్తించి స్వచ్ఛ విద్యాలయం పురస్కారాలను ప్రకటించుట జరిగింది. 2018-19 సంవత్సరం నుండి ప్రభుత్వం నిర్వాహకులకు గౌరవభృతి చెల్లించుటకు నిధులను కేటాయించడమైనది. 2020 సంవత్సరంలో ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వర్యులు శ్రీ వై.యస్. జగన్ మోహన్‌రెడ్డి గారు " అమ్మ ఒడి" పథకం ద్వారా విద్యార్థుల ప్రతి తల్లికి చెల్లించిన సొమ్ము రూ. 15,000/- లో స్వచ్ఛందంగా పాఠశాలల నిర్వహణకు గానూ చెల్లించిన రూ. 1,000/-తో పాటు ప్రభుత్వ నిధులతోనూ ఉన్నత ప్రమాణాలతో కూడిన ఆరోగ్య రక్షణ కార్యక్రమం నిర్వహించుటకు నిర్ణయం తీసుకొనుట జరిగినది. " నాడు - నేడు" కార్యక్రమంలో భాగంగా మరుగుదొడ్ల నిర్మాణం, అవసరమైన మరమ్మత్తులు నిర్వహించుట జరుగుచున్నది. పాఠశాలలోని ప్రతి 40 మంది విద్యార్థులకు 2 మూత్రశాలలు, 1 మరుగుదొడ్డి, 1 వాష్ బేసిన్ బాలురు, బాలికలకు వేరు వేరుగా నిర్మించుట జరుగుచున్నది.

### లక్ష్యాలు :

1. అనారోగ్యమును నిర్మూలించి, ఆరోగ్యకరమైన, ఆహ్లాదకరమైన పరిసరాలలో విద్యనందించుట.
2. పాఠశాలలో విద్యార్థుల ప్రవేశాలను పెంచుట.
3. విద్యార్థుల హాజరు శాతం పెంచుట.
4. పాఠశాలలలో విద్యార్థుల Dropout ను నిరోధించుట.

**పాత్రలు, బాధ్యతలు : ప్రధానోపాధ్యాయులు మరియు ఉపాధ్యాయులు:**

1. పాఠశాల ప్రధానోధ్యాయులు / ఉపాధ్యాయులు పాఠశాల పరిసరాలు, మూత్రాశాలలు, మరుగుదొడ్లు, వాష్ బేసిన్‌లు పరిశుభ్రంగా ఉండేలా చర్యలు తీసుకొనుట.
2. విద్యార్థులలో పరిసరాలు, వ్యక్తిగత పరిశుభ్రతపై అవగాహన కల్పించి, ఆచరించేలా చూచుట.
3. పనివారిచే సక్రమంగా పని నిర్వహించేలా చూచుట.
4. పరిశుభ్రతకు అవసరమైన సామగ్రిని సమకూర్చుట.
5. విద్యార్థిని, విద్యార్థుల తల్లిదండ్రుల కమిటీలతో సమావేశాలు నిర్వహించి పరిశుభ్రతపై అవగాహనను కల్పించుట.
6. ఆసక్తి, అవగాహన ఉండి స్వచ్ఛందంగా ముందుకు వచ్చే వ్యక్తులు, సంస్థల నుండి విరాళాలు సేకరించి మెరుగైన పరిస్థితులను ఏర్పరుచుట.
7. ప్రతి దినం పాఠశాల పరిసరాలను, మూత్రాశాలలు, మరుగుదొడ్లను పరిశీలించుట.
8. వాటికి అవసరమైన నీటి సరఫరా మరియు వాడుక నీరు బయటకు పోయేలా ఏర్పాట్లు,మరమ్మత్తులు ఎప్పటికప్పుడు జరిగేలా చూచుట.
9. విద్యార్థులు తరచూ (అనగాఅవసరాలను తీర్చుకొన్న తదుపరి మరియు భోజనానికి ముందు, తరువాత) చేతులను శుభ్రపరుచు కొనేలా చూచుట.
10. ప్రతిరోజు శానిటేషన్ App లో వివరాలను, ఫోటోలను Upload చేయుట.
11. విద్యార్థులకు తరచూ ఆరోగ్యపరమైన పరీక్షలు అందుబాటులో ఉన్న ఆరోగ్య సంస్థ వారిచే నిర్వహించుట.
12. నిపుణలతో విద్యార్థులకు అవగాహన సదస్సులను ఏర్పాటు చేయుట.
13. పనివారికి గౌరవభృతి అందేలా చూచుట (చర్యలు తీసుకొనుట)
14. మూత్రాశాలలు, మరుగుదొడ్ల ప్రవేశ ద్వారము వద్ద ఎల్లప్పుడు పొడిగా ఉండే కార్పెట్లు ఉండేటట్లు చూచుట.
15. మూత్రాశాలలు, మరుగుదొడ్లు మరియు వాష్ బేసిన్ల నందు నీటి లభ్యత ఎల్లప్పుడు (Runningwater) ఉండేటట్లుచూచుట.
16. విద్యార్థుల వయస్సు దృష్ట్యా ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు **Toiletblocks, Urinalblocks** మరియు **Urinal block** చిన్న సైజులో ఉండే విధంగా చూడాలి.
17. మూత్రశాలలు, మరుగుదొడ్లు పరిసరములలో వినియోగించిన నీరు నిల్వ ఉండకుండా చూడాలి.
18. **World Health Day ,Hand Wash Day** వంటి పరిశుభ్రతకు సంబంధించిన కార్యక్రమములు పాఠశాలల నందు నిర్వహించి సంబంధిత వ్యక్తుల పనితీరును మెచ్చుకొనుట ద్వారా పరిశుభ్రతపై అవగాహన పెంపొందించాలి.

## విద్యార్థులు మరియు వ్యక్తి గత పరిశుభ్రత :

1. విద్యార్థులు వ్యక్తిగత మరియు పరిసరాల శుభ్రత పాటించాలి.

2. మూత్రశాలలు, మరుగుదొడ్లను సరైన విధానంలో వాడుట అనగా అవసరమునకు పోయినప్పుడు ముందుగా నీటిని వినియోగించుట, ఉపయోగించిన తదుపరి కూడా సరైన విధానములో సరిపడా నీటిని వినియోగించుట ద్వారా తరువాత వెళ్లినవారు ఉపయోగించు కొనేలా చూడాలి.

3. మూత్రము పోయి వచ్చిన తదుపరి చేతులను సబ్బుతోనే, సరిపోయేంత నీటితో శుభ్రపరుటకొనుట.

4. ఏ విధమైన అవశేషాలు నిల్వఉండకుండా ఉండుటకు, వీలుగా చేతి, కాలి గోళ్లని ఎప్పటికప్పుడు కత్తిరించుకొనుట.

5. తోటి విద్యార్థులు కూడా సక్రమముగా పరిశుభ్రతను పాటించేలా చూచుకొనుట.

6. ముఖ్యంగా బాలికలు ఋతుక్రమంలో వాడిన శానిటరీనాప్కిన్స్ ఎక్కడపడితే అక్కడ పడేయకుండా దానికొరకు ఏర్పాటు చేయబడిన చెత్త బుట్టలో సరైన విధానంలో పడవేయుట.

7. మంచి నీటిని త్రాగు ప్రతిసారి చేతులను శుభ్రము చేసుకొనుట.

8. భోజనానికి ముందు, తర్వాత కూడా సబ్బుతో చేతులను శుభ్రం చేసుకొనుట.

## విద్యార్థిని విద్యార్థుల తల్లిదండ్రులు – అవగాహన :

1. విద్యార్థిని విద్యార్థుల తల్లిదండ్రులు వారు వారి పిల్లలకు వ్యక్తిగత, పరిసరాల పరిశుభ్రతపై అవగాహన కల్పించి, ఆచరించేలా చూడాలి.
2. పిల్లలు చదువుచున్న పాఠశాలలను తరచూ సందర్శించి, పాఠశాల ఆవరణ, మూత్రాశాలలు, మరుగుదొడ్లు, చేతులను శుభ్రపరిచే **Wash basins** పరిస్థితిని పరిశీలించుట.
3. అవసరమైనచో ప్రధానోపాధ్యాయులు / ఉపాధ్యాయులు పనివారితో సంప్రదించి మెరుగైన పరిస్థితిలో శుభ్రంగా ఉండేలా చూచుట.
4. పేరెంట్స్ టీచర్స్ కమిటీ సమావేశమునకు హాజరై తగు సూచనలు ఇస్తూ,వాటికవసరమైన సామాగ్రి మొదలైన వాటిని సమకూర్చడం.
5. ఎవరైనా దాతలు, పూర్వపు విద్యార్థులు, స్వచ్ఛంద సంస్థల సహకారంతో సంప్రదించి విరాళాలు సేకరించుట.
6. సేకరించిన విరాళాలను జాయింట్ అకౌంట్‌లో జమ చేసేలా జాగ్రత్తలు తీసుకోవాలి.
7. సదరు సొమ్మును సక్రమంగా ఖర్చు అయ్యేలా నిర్ణయాలు తీసుకొనుట.
8. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వర్యులు శ్రీ వై,యస్. జగన్‌మోహన్‌రెడ్డి గారు ప్రవేశ పెట్టిన "అమ్మ ఒడి" కార్యక్రమము ద్వారా విద్యార్థిని విద్యార్థులు ప్రతి తల్లికి అందిన " అమ్మ ఒడి" మొత్తము అనగా రూ. 15,000/-లు నుండి ప్రతి తల్లి తప్పనిసరిగా రూ. 1,000/- పాఠశాల పరిశుభ్రత నిర్వహణ కొరకు స్వచ్ఛందంగా ఇచ్చేటట్లుచూడాలి.
9. పాఠశాల సందర్శన సమయంలో మూత్రాశాలలు, మరుగుదొడ్లు, వాష్‌బేసిన్లు, పరిసరాలు విషయంలో శానిటేషన్యాప్‌లో వివరములను, ఫోటోలను **Upload** చేయుట, వాటికి మార్కులను కూడా కేటాయించుట చేయాలి.

10. తరచుగా విలేజ్ / వార్డు హెల్త్ అసిస్టెంట్ మరియు శానిటరీ సిబ్బంది సహాయంతో పనివారు , విద్యార్థులకు ఆరోగ్య పరీక్షలు నిర్వహించేలా చూచుట.

## విలేజ్ / వార్డు ఎడ్యుకేషన్ అసిస్టెంట్, వార్డు / విలేజ్ సెక్రటరీ, హెల్త్ అసిస్టెంట్, శానిటరీ అసిస్టెంట్లు

1. విలేజ్ / వార్డు ఎడ్యుకేషన్ అసిస్టెంట్, వార్డు / విలేజ్ సెక్రటరీ, హెల్త్ అసిస్టెంట్, శానిటరీ అసిస్టెంట్ ల సహకారంతో పాఠశాలలను సందర్శించి పాఠశాల ఆవరణలోని అన్నీ ప్రాంతాలు పరిశుభ్రంగా ఉండేలాగాచూచుట, విద్యార్థుల, ఉపాధ్యాయులు, పనివారి ఆరోగ్య విషయమై పరీక్షలు నిర్వహించేలా చూచుట.
2. అవసరమైనచో విద్యార్థులకు పరిశుభ్రత గూర్చి అవగాహన కల్పించుట.
3. ప్రధానోపాధ్యాయులు /ఉపాధ్యాయులకు, పనివారికి తగు సూచనలు ఇచ్చుట.
4. పేరెంట్స్, టీచర్సు కమిటీ సమావేశాలకు హాజరై పరిశుభ్రత విషయంలో తీసుకొన్న నిర్ణయాలు సక్రమంగా జరిగేలా చూచుట.

## శుభ్రపరచు సిబ్బంది :

1. పని వారు పాఠశాలకు వచ్చే సమయంలో వ్యక్తిగత శుభ్రతను పాటించాలి

2. మూత్రశాలలను, మరుగుదొడ్లను ప్రతి దినము సరైన పద్ధతిలో శుభ్రము చేయుట.

3. మూత్రశాలలను , మరుగుదొడ్లను శుభ్రపరచిన పరికరాలను వెంటనే సరైన పద్ధతిలో శుభ్రపరచి ఎండలో ఆరబెట్టి తదుపరి .జాగ్రత్త చేయాలి.

4. అదే విధముగా శుభ్రపరుచుటకు వాడే కెమికల్స్‌ను పరికరములను విద్యార్థులు సంచరించే చోట కాకుండా వేరుగా జాగ్రత్త చేయాలి.

## పర్యవేక్షణ సిబ్బంది :

1. విద్యాశాఖకు సంబంధించిన MEO, DyEO, DEO, AD, SSA Monitoring Staff వారు శానిటేషన్ శాఖ సిబ్బంది, ఆరోగ్య శాఖ సిబ్బందితో విడి విడిగా లేదా అవకాశాన్ని బట్టి కలిసి కానీ పాఠశాలలను సందర్శించి తగు సూచనలు, సలహాలను ఇచ్చుట.
2. పాఠశాల పరాసరాలు, మూత్రశాలలు, మరుగుదొడ్లు, వాష్‌బేసిన్లు మొదలైనవి పరిశీలించుట.
3. పరిశీలించిన విషయములను శానిటేషన్ యాప్ ఫోటోను Upload చేయుట.
4. అన్నీ విధాలా బాగున్న పాఠశాలలను గుర్తించి, సిబ్బందిని విద్యార్థులను ప్రోత్సహించుట.
5. విద్యార్థులకు అవగాహన కల్పించుట.
6. పనివారికి కూడా తగు సూచనలు, అవగాహన కల్పించుట (వ్యక్తిగత,పరిసరాల శుభ్రత విషయంలో).
7. విద్యార్థులకు, పనివారికి ఆరోగ్య శాఖ అసిస్టెంటు / సిబ్బంది తరచుగా ఆరోగ్య పరీక్షలు నిర్వహించుట.
8. నిధులు, వివరాలు విషయమై రికార్డులను పరిశీలించుట.
9. పనివారి గౌరవభృతి సక్రమంగా, సకాలంలో చెల్లించేందుకు అవసరమైన చర్యలు తీసుకొనుట.
10. శుభ్రత కొరకు వాడే పరికరాలు, కెమికల్స్ మొదలగునవి సరైన పద్ధతిలో భద్రపరి చినది లేనిది పరిశీలించుట.

**శుభ్రత కొరకు అవసరమైన వస్తువులు :**
చీపుర్లు, బ్రష్‌లు, బ్లీచింగ్ పౌడర్, యాసిడ్, ఫెనాయిల్, సబ్బులు, బకెట్లు, మగ్గులు, గ్లౌజులు, మాస్కులు, స్లిప్పర్స్/ బూట్లు, క్లోత్ కోట్లు మొదలగునవి.

**కొనుగోలు :**
పై వస్తువులను కొనేటప్పుడు వాటి నాణ్యత, ఘాడత, కాలపరిమితి, ధర మొదలగునవి పరిశీలించి కొనుగోలు చేయాలి.

**జాగ్రత్త పరుచుట :**
నెలకు, 3 నెలలకు, 6 నెలలకు సరిపడే వస్తువులను ఒకేసారి కొనుగోలు చేసిన చో (వాటి కాలపరిమితిని అనుసరించి) వాటిని తెమలేకుండా, విద్యార్థులు సంచరించని ప్రదేశములలో జాగ్రత్తగా భద్రపరచవలెను.

**రికార్డులుభద్రపరచుట :**
ప్రతి కొనుగోలు, వాడకం, భద్రపరచుట, వాటికి సమకూరిన సామగ్రి (ప్రభుత్వ నిధులు, అమ్మ ఒడి వివరాలు, స్వచ్ఛంద సంస్థల వివరాలు, పూర్వపు విద్యార్థుల విరాళాలు మొదలగునవి) వాటికి, ఆరోగ్యశాఖ వారిచే విద్యార్థులకు, పనివారికి, సిబ్బందికి నిర్వహించిన పరీక్షల వివరాలు, తీసుకున్న జాగ్రత్తలు, మందుల వివరాలు, నిపుణులచే విద్యార్థులకు ఏర్పాటు చేసిన అవగాహన సదస్సులు మొదలైన వాటికి వేర్వేరుగా రికార్డులను మెయింటెయిన్ చేసి వాటిని ఆడిట్ కూడా చేయిస్తూ ఉండాలి.

మూత్రశాలలు, మరుగుదొడ్లను సందర్శన / తనిఖీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులు, శానిటరీ వర్కర్లు ప్రతి రోజు వార్డు / విలేజ్ ఎడ్యుకేషన్ అసిస్టెంటు వారానికి 3 సార్లు నిర్వహించి వాటియొక్క వివరములను, చిత్రాలతో సహా Toilet Cleaning Management System (TCMS) App లో పొందుపరచాలి. అలా తెలిపిన విషయాలకు చెక్ లిస్టులో వివరణ ఇచ్చినచో వాటికి ActionTaken Report (ATR) లో Ticket Rise అవుతుంది. అందులో నమోదు అయిన వివరములపై ప్రధానోధ్యాయులు 3 దినములలో చర్యగైకోని వాటిని మరల యాప్‌లో పొందుపరచవలసి ఉంటుంది. 5 రోజులలో మండల విద్యాశాఖాధికారులు, ఉపవిద్యాశాఖాధికారులు, 10 రోజులలో విద్యాశాఖాధికారులు, చర్యలు తీసుకోనాల్సి ఉంటుంది.